శ్రీ

# వేదాంతచంద్రిక

ప్రథమభాగము.

ఆత్మచిత్

ఇది

శ్రీమత్తర్క వేదాంతాదిశాస్త్ర విద్వాంసులగు

కొండమూరి వెంకటరత్న శాస్త్రులవారిచే

రచియింపఁబడి

వివృతసూత్ర భాష్యాది శతాధిక గ్రంథకర్తలగు

బ్రహ్మశ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రులచేఁ

బరిశోధింపఁబడి

బెజవాడ, వాణీముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే

ముద్రింపింపఁబడినది.

1913.

దీనివెల రు ౧-౦-౦.

# ఉపోద్ఘాతము.



చదువరులారా,

ఈ గ్రంథకర్తలు గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకా అద్దంకి గ్రామసమీపస్థమగు కొండమూరుగ్రామ నివాసులును శ్రీవత్ససగోత్ర ఋక్శాఖీయ ఆశ్వలాయనసూత్రాన్వయాభిజాతులును కామాక్షుంబికా వెంకటప్పయ్యావధానుల ప్రియతనూజులును నై యున్నవారు. వీరు బాల్యమున కావ్యనాటకాలంకారములఁ జదివి గోదావరీతీరమున కోనసీమదేశమందు తర్కశాస్త్రాధ్యయనముచేయ నాచెంతకేగి యందు జాగదీశాద్యగ్రంథములఁ బఠించి పిదప బ్రహ్మశ్రీ కందుకూరి కృష్ణశాస్త్రులవారి సన్నిధిని వ్యాకరణశాస్త్రమందుఁ గౌముదినియుఁ జదివి యుభయశాస్త్రములందును బాండితిఁగన్నవారు. వీరు పంచమకక్ష్యా పర్యంతము హూణభాషనుగూడ నధ్యయనముచేసియుండిరి. మఱియు బ్రహ్మశ్రీ బ్రహ్మవిద్యాచార్యులగు బెల్లంకొండ రామారాయకవీంద్రుల సన్నిధానమున నుపనిషద్భాష్యములను జదివి బ్రహ్మవిద్యయందును బాండితిఁగాంచి కాపిలాదినయంబులందును గృతపరిశ్రములై యున్నవారు. ఇటీవల వేదాంతము తెనుఁగుభాషలోఁ దేటతెల్లముగ నెల్లరకుఁ దెలియునటుల రచింపఁబూని ప్రప్రథమమున నీవేదాంతచంద్రికను నిర్మించి యందలిప్రథమభాగమును ముందు ముద్రింపఁజేసిరి. మఱియు మాయానిర్వచనము, జీవప్రశంస అను రెండుగ్రంథముల రచియించి వానినియు, వేదాంతచంద్రిక ద్వితీయ తృతీయభాగములను ముద్రణార్థ మొసగియున్నవారు. ఈచంద్రికయం దాత్మ చిత్తనియు, బుద్ధ్యాదిసకల జగత్తు జడమనియు, శ్రుత్యనుమానాదులచే సహేతుకముగ బోధింపఁబడినది. 1-2 పుటలయందు బృహదారణ్యక షష్ఠాధ్యాయ తృతీయ బ్రాహ్మణమున జనకునికి యాజ్ఞవల్క్యుఁ డుపదేశించినరీతి ననుసరించి యందు నాత్మయొక్క స్వయంప్రకాశరూపము తెల్పఁబడినది. 4వ పుట యందు బుద్ధి యాత్మ కాదని తెల్పఁబడి 5-10 పుటలయందు ఛాందోగ్య షష్ఠప్రపాఠకమందు శ్వేతకేతువునకు ద్దాలకుఁ డుపదేశించినసరళిననుసరించి బుద్ధి యన్నరససూక్ష్మాంశముచే నాప్యాయితమగుచుండ స్వవిషయము తెలిసికొన సమర్థమగును. లేనియెడల కాదనియు, ఈజగత్తు సూక్ష్మమైన సద్రూపమునుండియే పుట్టినదికాని శూన్యమునుండి పుట్ట

లేదనియు, ఈజగత్తుకు వటవృక్షమునకు బీజమువలె మూలము స్వరూప మొకటికలదు. ఘటము మట్టినుండి పుట్టును. మట్టినినీవు తెలిసికొంటివేని ఘటము మట్టికంటె వేఱుకాదు కనుక ఘటము మట్టియేయని నీవు తెలిసికొనఁగల్గెదవు. అట్లే ఈ జగన్మూలమును (unity of the world) దెలిసికొంటివేని ఈసర్వజగత్తును నీవు తెలిసికొనగల్గెదవనియు పుష్పములు వ్యభిచరించుచున్నను సూత్రము వ్యభిచరింపకుండునట్లు స్వప్నజాగరములలో జ్ఞాతృత్వజ్ఞేయములు ప్రతీతములై సుషుప్తియం దు వ్యభిచరించుచున్నను జ్ఞానముమాత్రము వ్యభిచరింపకయుండెడిని అదియే యీజగన్మూలము. అదియే నీవు ఈదేహాదిసంఘాతము నీవు కావు అనియు నుదాహరణపూర్వకముగ నుడివి బుద్ధియందుఁ బ్రకాశించెడి చైతన్యధర్మ మన్యపదార్థము దనిని రూపింపఁబడెను. 11-18 పే జీలయందు బుద్ధిబోధల క్షీర మరకత మణ్యాది దృష్టాంతములచే వి చనముగఁదెల్పి వానిని వేఱువేఱుగాఁ దెలిసికొన మేధావులును మో హముజెందియుండిరని నుడివి దాని కుదాహరణపూర్వకముగ ఛాంద గ్యోష్టమప్రపాఠకమునఁ బ్రజాపతిచే నింద్రవిరోచనులకుఁ జెప్పఁబడి నక్షివిద్యనుబోధించి దేహబుద్ధీంద్రియములు, జడములు, వానియందు బ్రకాశించెడి చైతన్యమాత్మదికాని వానిది కాదని నిరూపింపఁబడినది 19-21 పుటలయందు ఇంద్రియములే యాత్మదేహమే యాత్మయను తము లున్మూలనము [illegible]ంపఁబడినవి. బృహదారణ్యక షష్ఠాధ్యా మందు జనకునికి యాజ్ఞవల్క్యుఁడు చెప్పినమార్గమనుసరించి స్వప్న దువలె జాగరమునందును నాత్మ స్వయంప్రకాశమే. ఆత్మ చైతన్య న్నియవస్థలలో నశింపక యసంగమై కామకర్మాదిధర్మములచే స్పృ పఁబడక ప్రకాశించుచుండెడిని స్వప్నపదార్థమసత్యములని నిరూపిం ట మొదలగువిషయములు 22-40 పేజీలయందు బోధింపఁబడినవి. 40- 42పేజీలలో స్వప్నజాగరసుషుప్తుల దెలిసికొనువాఁడు మాయచే నా రింపఁబడి స్వరూపజ్ఞానము లేకయున్నవాఁడు. వాఁడు నిజమైన యా కాఁడు. వానికంటె వేఱుగా శుద్ధమైన తెలివి యొకటికలదు. అది నిజమైనయాత్మ. అది యెతురీయమని చెప్పఁబడును. అదియేనీవని నేననియు మాండూక్యగౌడపాదకారికావిద్యననుసరించి నిరూపింప

డె. 43-47 పేజీలయందు కేనోపనిష ద్విద్యారహస్య మాఖ్యాయికా పూర్వకముగ నుపదేశింపఁబడినది. 48-52 పేజీలయందు స్వప్నప్రపంచమువలె జాగరప్రపంచమును స్వప్నమేకావున నసత్యమేయని యాఖ్యాయికాపూర్వకముగనుడివి యాత్మయందుఁ దోఁచఁబడెడియజ్ఞానమును నాభాసమాత్రమేయని నిరూపింపఁబడె. ఇట్లీగ్రంథమందన్ని యుపనిషత్తులవిద్య తేటతెనుగుమాటలతో సులభశైలిని నెల్లరకుఁ దెలియునటులఁ జేర్చి వ్రాయఁబడియున్నది. కనుక నియ్యది సర్వోపనిషత్సారమనియు బ్రహ్మవిద్యనుకోరెడి వారికెల్లరకు దీని నర్థగ్రహణపూర్వకముగాఁ జదువుటవలన నన్నియుపనిషత్తులవిద్య సుకరముగాఁ దెలియఁగలదనియు వక్కాణింప మిక్కిలి సంతసించుచున్నాడను. ఇందు సుఖబోధార్థమై వదలిపెట్టఁబడిన పదసంధ్యాది ముద్రణస్ఖాలిత్యదోషముల గుణగ్రాహిణులగుపండితులు గుణములుగ గ్రహించియీగ్రంథరత్నముకుఁ బ్రత్యయావలంబులగుదురుగాత.

8-6-1913.

ఇట్లు,

పేరి లక్ష్మీనారాయణశాస్త్రి,

విజయనగరాస్థానికసంస్కృతపాఠశాలా తార్కికమణి.

---

## విషయసూచిక.

# పండితాభిప్రాయము.

వేదమూర్తీనాం బ్రహ్మశ్రీ మతాం కె. వెంకటరత్న శాస్త్రిణాం సన్నిధిం ప్రతి దెందుకూ ర్యుపనామక నరసింహశాస్త్రిణా లిఖితేయం పత్రికా.

తత్ర భవద్భిః ప్రేషితః వేదాంతచంద్రికాఖ్యో గ్రంథః మయా సమ్యగవలోకితః. అయం గ్రంథః వేదాంతసిద్ధాంతానుసార్యేవ అత్ర బృహదారణ్యక ఛాందోగ్యాదిగతా ఖ్యాయికోదాహరణ పూర్వకం బ్రహ్మవిద్యా సమ్యక్ప్రతిపాదితా వ్యుత్పిత్సూనాం వ్యుత్పన్నానాంచ సర్వేషాం అయ మత్యంతోపకారీత్యహం మన్యే. తత్రాప్యాంధ్రభాషాయాం సులభశైల్యామిత్థం ప్రకటితేతి అతీవ సంతుష్టాంతరంగోఽహం.

గుంటూరు,
జూన్, 1913.

దెందుకూర్యుపనామక నరసింహశాస్త్రి,
వేదాంతతర్కవిద్వాన్.

---

వేదాంతచంద్రికాశైలి మృదుమధురద్రాక్షాపాకయుక్తమై యున్నది. ఉపనిషత్సారరహస్య మిందు వెల్లడింపఁబడియున్నది.

వా. పట్టాభిరామశర్మ.
30-6-13.

---



# వేదాన్త చన్ద్రిక.

---

శ్లో॥ యత్ప్రకాశసుఖాభిన్నం యన్మంత్రేణ ప్రకాశితం ।
వివృతం బ్రాహ్మణేతత్స్యా మదృశ్యం బ్రహ్మనిర్భయం॥

శిష్యంప్రత్యాచార్యస్య ప్రశ్నః :—నిజముగా నీయాత్మయన నేమి? నీ యాత్మ, ఈ స్థూలశరీరమా? లేక బుద్ధియా? లేక యింద్రియముల ద్వారమున బాహ్యశబ్దాది విషయముల గ్రహించుచు సుఖదుఃఖముల ననుభవించుచు నేను వినుచున్నాను, నేను దెలిసికొనుచున్నాను, అని యనుకొనెడి జ్ఞాతయా? (తెలిసికొనువాఁడు) ఈ మూఁటిలో నేదియు నీ నిజమైన యాత్మ కానేరదు. ఎందుకనిన, ఇవి కాలత్రయమందుఁ డెడి వి కావు. కాలత్రయమం దబాధితముగా (వ్యభిచరింపక) నుండెడిదియే సత్యము. ఇవి జలమందు, అలలవలె నొకప్పుడు ప్రతీతములై మఱియొ కప్పుడు వ్యభిచరించుచుండును. కావున నివి సత్యములు కానేరవు ఈ మూఁటికంటె విలక్షణమై యొప్పారు జ్ఞానమాత్మస్వరూపము (శుద్ధమైన తెలివి) నీలోనొకటి యున్నది. అదియే నీ నిజమైనయాత్మస్వరూపము అదియే కాలత్రయమందుసత్యమైనది. లోకములోఁ బగలు పురుషుఁడు, (అనగాఁ గార్యకరణసఙ్ఘాతాత్మకః) బాహ్య పదార్థములఁ దెలిసికొనును, క్షేత్రములకేగును. అచ్చటఁ బనిఁజేసికొనును, తిరిగి స్వగృహము నకు వచ్చును, ఇటునటువిహరించును, బంధువులతోఁ గలిసికొనును, దేశాంతరముల కేగును. మఱియు, ఇతరమైన నానా వ్యవహారములు సలుపును, ఏదోయొక జ్యోతిస్సుయొక్క ప్రకాశముండునపుడే, ఇతఁడు వ్యవహరింపఁ గలుగును. కేవలము తమస్సునందు, ఈ లోకవ్యవహార ము సలుపఁజాలఁడు. కానఁ బగలు, ఈ పురుషుఁడు, ఏ జ్యోతిః ప్రకాశ

ముచే నీలోకవ్యవహారము సలుపఁగలుగునన్న, అతనికి సూర్యుఁడే జ్యోతిస్సు. సూర్యప్రకాశముచేతనే స్వక్షేత్రగమనము బంధుదర్శనము మొదలగు సకల వ్యవహారములు సలుపఁగలుగును, అని నీవు పలికెదవు అయితే, ఆసూర్యుఁడు, అస్తమించును అప్పుడే జ్యోతిః ప్రకాశముచే నీ పురుషుఁడు వ్యవహరింపఁగలుగునన్నఁ జంద్రుఁడే యతనికి జ్యోతి. చంద్రప్రకాశముచేతనే యన్ని వ్యవహారములు నేసికొనఁగలుగును, అని నీ వనెదవు. అయితే, ఆచంద్రుఁడును అస్తమించును అవ్వేళ నీపురుషుఁడు ఏ జ్యోతిస్సుచే నీపదార్థములఁ దెలిసికొనఁగలఁడన్న, అగ్నియే యతనికి జ్యోతి; అగ్నిచేతనే అతఁడు దీపమును వెలిగించుకొనును దీపముచే సమస్తమును దెలిసికొనఁగలుగును. స్వగృహవ్యాపారముల నిర్వర్తించుకొనఁగల్గును అని నీ వనెదవు. సూర్యుడును, అస్తమించును చంద్రుడును అస్తమించును. అగ్నియును వర్షాకాలమందు సంతతవృష్టిచేఁ బ్రజ్వలింపఁజాలదు. గాలివలన దీపమును ఉండఁజాలదు మేఘోదయముచే నంతట అంధకారము వ్యాపించియుండును అవ్వేళ నీ పురుషుఁడు తనహస్తమునేతాను దెలిసికొనఁజాలఁడు అప్పుడు ఇతని కేమిజ్యోతి? ఏజ్యోతిచే నీలోకవ్యవహారముసలుపఁగలఁడన్న, శబ్దమే అతనికి జ్యోతి. ఒక శునకమైన అఱచును, లేక ఒక గర్ధభమైన నంచును ఆశబ్దముచే శ్రోత్రేంద్రియము దీపింపఁజేయఁబడును దాని సంబంధముచే మనస్సునందు ఇది శునకము ఇది గార్ధభము అని వివేకజ్ఞానము పుట్టును. అంత వానికడకుఁబోయి వాఁడు తాడనాదివ్యవహారము జేయఁగలుగును. ఇటుల బాహ్యగంధముచే ఘ్రాణేంద్రియ మభివ్యంజితమగును. దాని సంబంధముచే మనస్సునందు, ఇచ్చట గంధద్రవ్యముకలదని వివేకముదయించును. పిమ్మట వాడు దానింగైకొని లేపనాదులఁ జేసికొనఁగల్గును. ఇటుల, ఆయాగంధశబ్దాది విషయములు శ్రోత్రాదీంద్రియములతో సంయోగించుచుండును. తద్వారమున మనస్సుచేత యాయా విషయములఁ దెలిసికొని పురుషుఁడు లోకమునందు వ్యవహరింపఁగల్గెడిని. ఇందుకుఁ బ్రమాణము శ్రుతి " మనసాహ్యేవ పశ్యతి మనసా శృణోతీతి" అని నీ వనెదవు స్వప్నములోను జాగరమునందు

లె వీఁడు బంధుదర్శనము, తద్వియోగము, క్షేత్రాదిగమనము, ఆగమనము మొదలగు సకల వ్యవహారములు నిర్వర్తించుకొనును. సుషుప్తి నుండి మేల్కాంచినపోడనే నేను సుఖముగా నిద్రఁజెందితి అయితే, అచ్చట నాకేమియుఁ దెలియలేదు "సుఖమహమస్వాప్సం నకిఞ్చిదవేదిషం" అని వాఁడు స్మరించును గావున సుషుప్తిలోను, సర్వవేదనాభావము వాఁడు దెలిసికొనుచున్నవాఁడే. స్వప్నసుషుప్తులలో, ఈసూర్యుఁడుగాని లేక ఈ చంద్రుఁడుగాని లేక ఈదీపములుగాని లేక ఈశబ్దాది విషయములుగాని యుండవు. జాగరమునందుఁ దనకంటె అతిరిక్తమైన సూర్యాది జ్యోతిస్సులచేతనే వీఁడు బంధుపుత్రాదులఁ జూడఁగల్గును, దెలిసికొనఁగల్గును. సర్వలౌకిక వ్యవహారములు సలుపుచుండఁగల్గును కావున స్వప్నావస్థయందును బంధుపుత్రాది విషయములఁ దెలిసికొన వీనికి అనఁగా (సంఘాతపురుషునికి) తనకంటె అతిరిక్తమైన జ్యోతి యొకటియుండవలెను. జాగరమునందు సమస్తజ్యోతిస్సులు ఈదేహబుద్ధీంద్రియములకంటె వేఱుగాఁ గనఁబడును. స్వప్నమందును, ఏ జ్యోతిచే వాఁడు పదార్థములఁ దెలిసికొనుచుండునో, ఆజ్యోతి ఈదేహముకంటె, ఇంద్రియములకంటె, బుద్ధికంటె, వేఱుగానుండునదియే కావలెను. ఈ బాహ్యజ్యోతిస్సులనయితే, చక్షురాదీంద్రియములు దెలిసికొనఁగల్గును. (ఇంద్రియప్రత్యక్షములు) ఆయాంతరమైన జ్యోతిని జక్షురాదీంద్రియములు తెలిసికొనఁజాలనివై యున్నవి అనఁగా (అతీంద్రియము) గాన, అయ్యది అభౌతికమనియు, బాహ్యభౌతికజ్యోతిస్సులకంటె విలక్షణమైనదియును అని మనము దెలిసికొనవలెను. స్వప్నములోను ఇతఁడు దేశాంతరగమనాది వ్యవహారము సలుపుచుండును గనుక ఆవ్యవహారానుమేయమైనజ్యోతి సర్వబాహ్యజ్యోతిస్సులు నశింపఁగా మిగిలినదై భాసించుచుండెడిని. అందుచే ఆయాంతరజ్యోతిని, ఆదిత్యాదిజ్యోతిస్సులవలె దేహబుద్ధీంద్రియములకంటె నతిరిక్తముగా దేహేంద్రియములకు భాసకముగా అన్యజ్యోతిస్సులచే నవభాసింపజేయఁబడనిదిగాను నీవు దెలిసికొనవలె. అదియే నీ నిజమైన యాత్మజ్యోతియనియు భావించుకొనవలె దీనినే వేదాంతులు సత్తనియుఁ జిత్తనియు నానందమని

యుఁ జెప్పుదురు. చిత్తనగాఁ దాను అన్యముచేఁ దెలిసికొనబడనిదై తన సంబంధముచే నితరములను దెలిసికొన సమర్థములనుగాఁ జేయునది. (అనన్యావభాస్యత్వేసతి ఇతరావభాసకత్వం చిత్త్వం) ఆ స్వప్నపురుషవ్యవహారానుమేయమైన జ్యోతియే శుద్ధమైన తెలివిరూపము ఇదియే స్వయంప్రకాశము అగ్ని సంబంధముచే లోహము ఇతరపదార్థముల దహింపఁజేయఁగల్గెడిరీతిని దీనిసంబంధముచేతనే బుద్ధీంద్రియాదులు స్వస్వవిషయములఁ దెలిసికొన సమర్థములగుచుండును కాని యవి స్వతంత్రముగా విషయములఁ దెలిసికొనఁజాలవు కావున ఈ స్థూలశరీరము నీవుకావు ఈబుద్ధియు నీవుకావు. ఈవిషయానుభవముఁజేయు జ్ఞాతయు నీవుకావు. స్వప్నమున సంఘాతపురుషవ్యవహారముచే ననుమేయమును, స్వయంప్రకాశమును అయిన జ్యోతియేనీవు. జాగ్రదవస్థయందు నీనిజమైన స్వయంప్రకాశ స్వరూపము నీ వెఱుఁగఁజాలవు. ఎందుకనిన అప్పుడు ఈ సంఘాతాత్మకమైన జ్ఞాత బాహ్యములును దనకంటే అన్యములైన ఆదిత్యాది జ్యోతిస్సులచేఁ బ్రకాశింపఁజేయఁబడుచుఁ బదార్థములఁ దెలిసికొనుచుండునని తలచుచుండెడిని, కావునఁదనను అవభాసింపఁజేసెడి యితర సూర్యాదిజ్యోతిస్సు లుండువేళ వేఱుగా వివేకముచే తనను స్వయంప్రకాశరూపుఁడనుగా దెలిసికొన సమర్థుఁడుకాఁజాలఁడు స్వప్నమందైతే బాహ్యములైన ఆదిత్యాదిజ్యోతిస్సులుండవు కావునఁ దనను స్వయంప్రకాశునిగా వివేకముతో దెలిసికొన సమర్థుఁడు కాఁగలుగుఁ గనుకనే పరమకారుణికమైన శ్రుతియును స్వప్నమందే నీకు నతిశయ స్వయంజ్యోతిష్ట్వము చూపుచున్నది. ఇందుకుఁ బ్రమాణము

బుద్ధిరాత్మానభవతి.

శ్రుతి "అత్రాయంపురుషః స్వయంజ్యోతిరితి" బుద్ధి స్వయముగానే విషయములఁ దెలిసికొనుచుండును, సంకల్పించుచుండును, వినుచుండును, చూచుచుండును. అదియే స్వభావముగా విజ్ఞానముగలదై ప్రత్యక్షముగాఁ గనఁబడుచుండును, దానికి విజ్ఞానము నిచ్చునదియును దానికంటె అతిరిక్తమయినదియును, వేఱొకటి ప్రత్యక్షముగాఁ బొందఁబడుటలేదు. అదియే స్వయముగానే స్వప్నమందును విషయములఁ దెలిసి

కొనుచుండునట్లు కనఁబడుచుండును. దానికంటె అతిరిక్తమయిన చైతన్యజ్యోతియొకటి వేఱుగా నెందుకొప్పుకొనవలె? కావున ఆబుద్ధియే, ఆత్మయని నీవుపలికితివేని అట్లయినచో దానితెలివి చైతన్యధర్మము. ఏవేళయందును లోపింపఁగూడదు. లోకములో దేనికి నెయ్యది స్వభావధర్మమో, అయ్యది దానింవిడువఁజాలదు. అగ్నికిఁ బ్రకాశము స్వభావధర్మము. ఆప్రకాశముదాని నెప్పుడైనను వదలిపెట్టునా? వదలిపెట్టదు ఒకయెఱుపుపుష్పమునునీవుదీసికొనుము. దాని ఎఱుపుగుణమునుస్వరూపమునకు హాని లేకుండా నీవు నశింపఁజేయగలవా? దానిని, ఏసాధనముచేతను నీవు ఒఱపిడిచేసినను దాని ఎరుపును దీసివేయఁజాలవు. కనుక స్వభావధర్మమునకు నేయవస్థయందును నపాయము సంభవింపనేరదు. ఇందుకుఁ బ్రమాణము "నహిస్వభావో భావానాంవ్యావర్తేతౌష్ణ్యవహ్నేః" బుద్ధికిఁజైతన్యముఁ అనగా స్వయముగానే విషయములఁ దెలిసికొను తెలివి) స్వభావగుణమైనచో, అయ్యది దానియందు, అన్నివేళలందు, అన్నియవస్థలయందు నేమార్పును జెందక దానినివదలకయే యుండవలె. నీవు కొంచెము మత్తుమందు నాఘ్రాణించుము. తత్క్షణమే నీబుద్ధికుండెడి తెలివిలోపించి పోవును ఆగంతుకగుణములులోపించును. స్వభావగుణములు లోపించుట ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధము. మఱియు లోకములోఁ బురుషుఁడు అన్నము బాగుగాఁ దినుచుండినపుడే మనస్సు చురుకుగా విషయములఁ దెలిసికొనుచుండును. లేనియెడలనది మొద్దుగానై విషయములఁదెలిసికొనఁజాలనిది యగుచుండును. మనసు, అన్నమయమని శ్రుతియునుజెప్పుచున్నది. శ్రుతి "అన్నమయంహిసోమ్యమనః"॥ అనగాభుక్తమైనయన్నమన్నమయకోశమునందుజాఠరాగ్నిచేఁ బచనముచేయఁ బడును. ఆపచనముజేయఁబడిన యన్నముయొక్క కొంతభాగము స్థూలతమముగాను, కొంతమధ్యముగాను గొంతయణీయముగాను నేర్పడును స్థూలతమాంశము పురీషమగును. మధ్యమాంశము రసరక్తాదిరూపముగాఁబరిణమించి మాంసమగును. అణీయాంశమూర్ధ్వగాముగానుండెడి హృత్పిండమునుబొంది హృదయమందలి సూక్ష్మనాడులలోఁ బ్రవేశించి వాగాదీంద్రియ సంఘాతమునకు స్వవిషయప్ర

కాశసామర్థ్యవిషయును గల్గించుచు మనస్సగును. అన్నగ్రామనస్సుయొక్క యవయవములఁబొందించును. (మనోరూపేణపరిణమన్ మనసఃఉపచయం కరోతి)అంత మనస్సు స్వవిషయమును బ్రకాశింపఁజేయ శక్తిగలదగును. అన్నోపయోగముచేమనస్సునందు విషయప్రకాశనశక్తి చూడఁబడు చుండుటచేతను, అన్నోపయోగములేకపోయినయెడల విషయప్రకాశనశక్తి చూడఁబడకపోవుటచేతను, మనస్సునందుఁ జూడఁబడెడివిషయ ప్రకాశనఁ జేయుశక్తి యోగమాపాయములను బొందుచుండుటవలన నయ్యది దానిది కాదనియు, అన్యధర్మమనియు, నీవుదెలిసికొనవలెను. అయ్యదిమనోధర్మమైన మనస్సునం దన్నివేళలందుఁజూడఁబడవలె. అటులలేదుకాన మనస్సుస్వభావముగా స్వవిషయాభివ్యంజన సమర్థము గాకపోవుటవలన స్వయంప్రకాశమని చెప్పుటకు వీలులేదు. ఇందుకొక యాఖ్యాయికను జెప్పెదనువిను, ఉద్దాలకుడను నొకమహర్షికి శ్వేతకేతువనునొక పుత్రుఁడుకలఁడు. ఇతడు ద్వాదశవర్ష వయస్సు గలవాఁడైనప్పుడు తండ్రి యతనిని విద్యావంతునిగాఁ జేయఁదలచి "యోకుమారా ! మనకులమున కనురూపమైనగురుసమీపమున కధ్యయనార్థముపోయి బ్రహ్మచర్యమును జరింపుము" అనియతనింగూర్చి పల్కె.. అంతనతండాచార్యు కడకుంబోయి ద్వాదశవర్షములు బ్రహ్మచర్యావాసమునుజేసి సకలవేదములంజదివి ప్రౌఢమతియై తనను సర్వవేదపారంగతునిగాఁ బరిపూర్ణునిగాఁ దలఁచుచు దురభిమానియై తృణీకృతజగత్త్రియుఁడయి తండ్రికడకేగెను. తరువాతఁదండ్రి యితని పూర్ణత్వాభిమానముదెలిసికొని దానిఁబోఁగొట్టఁదలఁచి యితనికి బ్రహ్మజిజ్ఞాసను పుట్టించఁగలందులకై యిట్లుప్రశ్నచేసె. ఓకుమారా! నిన్నుప్రౌఢమతినిగాను బూర్ణాభిమానినిగాను దలఁచుచుంటివి ఆచార్యునివలన నీ వేమి యతిశయమునుగాంచితివి? కేవలశాస్త్రాచార్యోపదేశగమ్యమైనది యొకటిగలదు. దీనిచేతను అశ్రుతమైనదియు శ్రుతమగును. అతర్కితమైనదియుఁ దర్కితమగును. అవిజ్ఞాతమైనదియు విజ్ఞాతమగును. దానినినీవాచార్యునడిగి తెలిసికొంటివా? పుత్రుఁడదివిని యన్యవిజ్ఞానముచేతనన్యమెట్లుతెలిసికొనఁ బడఁగల్గును, అనితలఁచుచు నిటువంటిది యెట్లుగాడెడిన

ని తండ్రిడినడుగ కుమారా! కారణముకంటేఁగార్య మన్యముకానేరదు నీవెట్లు మృత్పిండమును దెలిసికొని తద్వికారజాతమైన సకలమృణ్మయ మును దెలిసికొనఁగలుగుదువో యటులనే లోకమందుఁ గారణమైనదా నిని దెలిసికొంటి వేనిదత్కార్యమైన సకలమును దెలిసికొనఁగ ల్గెదవు కనుక నేకవిజ్ఞానముచే నన్య విజ్ఞానము కల్గుననునదికలదని తండ్రి ప్ర తివచనముపల్కె. పుత్రుఁడు మాగురువులుదీనిని దెలిసికొనియుండిరేని నాకుపదేశించెడి వారలే. ఉపదేశింపరుకాన వారికి నియ్యది తెలియదని యూహించెదను. అనిపల్కి దీనికొఱకు తనను దిరిగి తండ్రియాచార్య సమీపమునకుఁ బంపించునేమోయని భయపడి దేనియొక్క విజ్ఞానము చేసర్వము దెలిసికొనఁబడఁగల్గునో దానినిమీరే యుపదేశింపుఁడు, అని జనకునినడిగె ఓకుమారా! నిర్విశేషమును నిరంజనమును, అణీయము ను, సర్వగతమును, అస్తితామాత్రమును, అయిమొప్పారు విజ్ఞానమొ కటికలదు, అనిసర్వవేదాంతములనుండి తెలియఁబడుచున్నది ఈస్థూల జగత్తునకుఁగారణమైనది అదియె కారణముకంటెఁగార్యము, అన్యము కాఁజాలదు మృత్తువలన ఘటముపుట్టును ఆఘటము మృత్తుకంటే, అ న్యమా? కాదు అయినను, అయ్యది నామరూపములచే వేఱుగా వ్య వహరింపఁబడుచుండును ఆవ్యవహారము వాగాలంబునమాత్రమే పర మార్థముగా మృత్తుకంటె, అన్యమైన ఘటమొకటికలదా? లేదు మృ త్తేఘటము మృత్తుదెలిసికొనఁబడినఁ దత్కార్యమైన ఘటమునుదెలిసి కొనఁబడఁగల్గెడిని అటులనే లోకమందుఁ గారణముదెలిసికొనఁబడినఁ దద్వికారమైన సర్వము దెలిసికొనఁబడఁగల్గును ఈస్థూలజగత్తు సన్మూ లముగాని నిమూలముకాదు సందేహమున్నచో, ఈన్యగ్రోధవృక్షము యొక్క యొకఫలమును ద్రుంచుకొని తీసుకొనిరమ్ము ఈవిషయమును ప్రత్యక్షముగాఁ జూపెదను అనిజనకుఁడు పల్కె, అంతవాఁడు, అటుల నే ఫలమును దెచ్చె ఒకఫలమును బగులఁగొట్టుమని జనకుఁడుపల్కఁ బుత్రుఁడును, అటులఁజేసె దానిలోపల నీవేమిచూచుచుంటివని జనకుఁ డడుగ మిక్కిలిసూక్ష్మములైన బీజములఁజూచుచున్నానని పల్కె ఒక బీజమునుకూడ భిన్నభిన్నముగాఁజేయుమని జనకుఁడు నుడువఁ బుత్రుఁ

డటులఁ జేసె దానిలో నీవేమిచూచుచుంటివని జనకుఁడడుగ నాకేమి యు నగపడుట లేదని కొడుకుపల్క భిన్నమైన వటబీజమునందణీయ ములైన యంశములు కలవు. అవి మిక్కిలి సూక్ష్మములు. అందుచేత నే నీవువానిని దెలిసికొనఁజాలవైతివి. ఈయణీయములైన సూక్ష్మాంశ ములలో నుండియె ఈస్థూలశాఖాస్కంధ ఫలపలాశవంతమైన న్య గ్రోధముత్పన్నమైనది కాని యత్యంతశూన్యములోనుండి యుత్పన్న మైనది కాదు ఆభావమువలన భావపదార్థమెప్పుడును పుట్టదు. భావప దార్థమువలన నభావము పుట్టదు. "నాసతో విద్యతేభావో నాభావో విద్యతేసత" ఇతి, అటులనే యీజగత్తునకుఁగారణమైన మిక్కిలి సూ క్ష్మవస్తువొకటికలదు అదిసద్రూపముకాని శూన్యరూపము కాదు అ య్యది యణీయముకాన స్ఫుటముగాఁ బొందఁబడదు అదిస్వయముగా, అస్తితామాత్రమే దానినుండియే కార్యమైన యీజగత్తునందు, అస్తి త్వము చూడఁబడుచుండును దీనియందుఁజూడఁబడెడి సత్తాస్ఫూర్తి దాని దే. దానికార్యమే ఈ జగత్తు కారణమందు లేనిసత్త కార్యమునందు జూడఁబడదు. కారణము స్వయముసత్తామాత్రమే గాన దానిని నీవుతె లిసికొనితివేని ఈసర్వజగత్తునునీవుదెలిసికొనఁగల్గుదువు అదియేకాలత్ర యమందు నబాధితముకానసత్యము అదియే సమస్తభూతములకుఁబ్ర త్యక్స్వరూపము అదియేనీవు ఈదేహము నీవుకావు. ఈవిషయా నుభవముఁజేయు జ్ఞాతయునీవుకావు. శ్రుతి "ఐతదాత్మ్య మిదగ్ సర్వం తత్సత్యం సఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అనిజనకుఁడుబోధించె మఱియు భుక్తమైనయన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సగును. పీతమైన యప్పుయొక్క సూక్ష్మాంశము ప్రాణమగును తైలాది రూపమైన తేజస్సుయొక్క సూక్ష్మాంశము వాక్కగును. అనియు నుప దేశించె. శ్రుతి. "అన్నమయంహిసోమ్యమనః, ఆపోమయః ప్రాణః తేజోమయీవాగితి" అదివిని శ్వేతకేతువు సముద్రమందలిమీనాదులు కేవలమమ్మాత్రమునే పానముజేయును అవి యన్నమును భక్షించుట లేదు అట్లయినను మనస్సుగలవై ప్రాణములుగలవై చూడఁబడుచున్నవి కేవలమన్నముభక్షించెడి యాఖుప్రభృతులు వాక్కులుగలవై ప్రాణ

ములుగలవై చూడఁబడుచున్నవి. అటులనే కేవలము స్నేహముపానముఁ
జేసెడివానియందుఁ బ్రాణమును మనస్సునుజూడఁబడుచుండును అన్నము
యొక్కసూక్ష్మాంశమేమనస్సగునన్న నన్నముభక్షింపని వానికామనస్సు
లేక పోవలె అటులలేదు యప్పుయొక్క సూక్ష్మాంశము ప్రా
ణమగునన్న జలపానముసేయనివానికిఁ బ్రాణము లేకపోవలె అటులలే
దు కావున మనఃప్రాణాదు లన్నాప్తేజస్సుల సూక్ష్మాంశములవలన ను
పచితింబొంది స్వవిషయప్రకాశన సమర్థములగునని యెందుకుఁ జెప్పవ
లెనని యడుగ సర్వము త్రివృత్కృతమే శ్రుతి "తాసాంత్రివృతంత్రివృ
తమేకైకా మకరోదితి" కావున మీనాదులు పానముజేసెడి యప్పులం
దును సూక్ష్ములైన యన్న తేజోంశములుకలవు ఆసూక్ష్ములైన
యన్న తేజోంశము లామీనాదులయొక్క మనోవాక్కుల నాప్యాయన
ముజేయుచున్నవి. ఇట్లె యాఖులచేభక్షింపఁ బడినయన్నమందును నప్తే
జోంశములుకలవు. ఆసూక్ష్మాంశములు ప్రాణవాక్కులగుచుండును కా
వున నన్నాదులయొక్క సూక్ష్మాంశములు మనః ప్రాణవాక్కులనుబొం
ది వానియందు విషయప్రకాశనశక్తిపుట్టించుచుండును, అనునదిప్రామా
ణికమే యని జనకుఁడుజెప్పె. తినెడియన్నాదులు మిశ్రీభూతములు వాని
లోనుండి సూక్ష్మాంశములెట్లు బయలుదేరును? అప్పులోనుండి నిర్గతమై
న సూక్ష్మాంశము ప్రాణమునేపొంది దానినివృద్ధింజెందించును అన్నము
యొక్కసూక్ష్మాంశమే మనస్సునుబొందును. తేజస్సుయొక్క సూక్ష్మాం
శమే వాక్కగును, అనియిట్లు తెలిసికొనవలెను. ఇవియిప్పటికినినాకు దు
ర్విలేకములై యున్నవి కావున దృష్టాంతపూర్వకముగా బోధించుమని
పుత్రుఁడడిగె మంథానముచేఁ జిల్కఁబడిన దధినుండి సూక్ష్మాంశము న
వనీతముగా నిర్గతమగును. ఆనవనీతము సర్పియగును అటులనే జాఠరా
గ్నిచేఁ బచనముచేయఁబడిన యన్నాదులలోనుండి సూక్ష్ములైన
యంశములు బయలువెడలును అవిమనోప్తేజస్సులఁబొంది స్వవిషయా
భివ్యంజన శక్తిని బుట్టించును అనిజనకుఁడుజెప్పె ఇప్పటికినాకు వా
నివిషయమై వివేకముదయించలేదు అన్నముయొక్క సూక్ష్మాంశము
మనస్సేయగును ప్రాణముకాదు అనువిషయమును దృష్టాంతపూర్వక

ముగా బోధించుమని పుత్రుఁడడిగె. నీవుదీనిని బ్రత్యక్షముగాఁ దెలిసికొన నిచ్ఛయించితివేని, అన్నరసముయొక్క సూక్ష్మాంశమువలన మనస్సునందుఁ గల్గెడిశక్తి షోడశకలారూపముగానుండును నీవుపంచదశాహములన్నము భక్షింపకుము యథేచ్ఛముగానప్పులఁబానముఁ జేయుము అప్పులపానముఁజేయుచున్న నీప్రాణముమాత్రము విచ్ఛేదమునుఁ బొందదు అనిజనకుఁడుజెప్పె పుత్రుఁడటులనే పంచదశాహము లన్నము భక్షింపక కేవల మప్పులనే త్రావెను. షోడశదినమునందు జనకునికడకేగి నేనేమిపఠింపవలెనని యడిగె ఓకుమారా! ఋక్కుల సామముల యజస్సులఁ బఠించుమనెను ఒకఋక్కుగాని యొకసామముగాని నామనస్సునగోచరింపలేదు ఇదివఱలో వీనినామ్నాయములచే మనస్సునందుంచుకొంటిని ఇప్పుడవి మనస్సునందు భాసించుటలేదు, అనిపుత్రుఁడు పల్కె లోకమందు మహత్తైయింధనములచేఁ బ్రజ్వలింపఁజేయఁబడిన యగ్ని శాంతమైనదై (చల్లారినదై) ఖద్యోత పరిమాణముగా మిగిలినదగును ఆయగ్నియప్పుడు తనకంటెనించుక యధికమైనదానిఁగూడ దహింపఁజాలదు అట్లేయన్నరసముయొక్క సూక్ష్మాంశముచే నీమనస్సునందుఁగల్గెడి షోడశకలారూప శక్తి యొక్క యొక కలావయవమే యిప్పుడు మిగిలినదాయె పంచదశదినములలోఁ బంచదశకలలుక్షీణించె ఖద్యోత మాత్రతుల్యమైన యీమనశ్శక్తిచేనిప్పుడు వేదములఁ దెలిసికొనఁ జాలవైతివి అన్నమును బాగుగాభుజించుము నీవువానినిదెలిసికొనఁగల్గెదవని జనకుఁడుచెప్పె పుత్రుఁడును నటులఁజేసి జనకునికడ కేగె జనకుఁడు ఋగాదుల వెనుకటివలెఁ జెప్పుమనియడిగె అవిప్రత్యక్ష ముగా మనస్సులోఁ బ్రకాశించినందునఁ బుత్రుఁడును వానినెల్లనుదెలిసి కొని చెప్పె ఖద్యోతమాత్ర పరిమాణమైన యగ్నితిరిగితృణాదులచే బ్రజ్వలింపఁ జేయఁబడిన మహత్తుగా వృద్ధింజెంది పూర్వపరిమాణముకంటె విస్తారపదార్థములఁ గాల్పఁగల్గెడిని అటులనే నీవు పంచదశాహము లన్నము భుజింపలేదుకనుక పూర్వమన్నరస సూక్ష్మాంశములచే మనస్సునందుఁ గల్గిన షోడశకలాత్మక శక్తిక్షీణించి యేకకలాత్మకముగా

మిగిలియుండె అందుచేనీవు బాగుగ సామాన్యముచేయఁబడిన బుగా దులనే తెలిసికోఁజాలవైతివి ఇప్పుడు నీవుతిరుగ నన్నము తింటివి ఆయన్నరస సూక్ష్మాంశముచే నీమనస్సునం దేకకలాత్మకముగా మిగిలియుండినశక్తి వృద్ధింజెందింపఁబడినదాయె అందుచేత నేనీవిప్పుడు వేదములఁ దెలిసికొనఁగల్గితివి అన్నోపయోగాభావమునందు మనస్సున స్వవిషయ ప్రకాశన సామర్థ్యముఁ జూడఁబడలేదు అన్నోపయోగముచే దానియందు సామర్థ్యము చూడబడినదికావున నన్వయవ్యతిరేకములచే నన్నముయొక్క యణీయాంశము మనస్సునేపొందును ప్రాణమునుబొందదు అన్నోపయోగములేకపోయినను ప్రాణమమ్మాత్ర పానముచేతనే స్వకార్య సమర్థమై చూడఁబడె కావుననప్పుయొక్క సూక్ష్మాంశము ప్రాణమునే పొందును మనస్సునుబొందదు అనిజనకునిచేఁ బల్కఁబడిన దీనినివిని పుత్రుఁడు మనః ప్రాణాదు లన్నాదిమయములని తెలిసికొనె." వయోవంతుని బుద్ధియందుండుఁ జురుకుఁదనమును దెలివియు వృద్ధుని మనస్సునందుఁ గనఁబడునా? కావునబుద్ధికి విషయములఁదెలిసికొను బోధనము స్వభావసిద్ధ ధర్మమైనదికానేరదు స్వభావమునకు వృద్ధిక్షయములుగాని యొకప్పుడుండెడికళ వేఱొకప్పుడుండకపోవుటయుఁగాని సంభవించవు. కావున నాబోధన మన్యపదార్థమునుండియే కలుగుచున్నది యనిమనముదెలిసికొనవలెను. అగ్నితప్తమయిన యుదకమందంగుళినుంచుము ఆయుదకము దానిని దహింపఁజేయును. ఆదహనశక్తి యగ్నివలన దానికిఁగలిగినదియా? లేక దానికి స్వభావగుణమా? స్వభావముచే నుదకము శీతమైకనఁబడుచుండును గావున నాజలమందలి దహనశక్తి జలమునకు స్వభావధర్మము కాజాలదు అయ్యది యగ్నిది కావున నగ్నికి స్వభావ ధర్మమయ్యెడిని. ఆజలమందలి యౌష్ణ్యమున కుదయించుటయు లోపించుటయుఁ గలవు. స్వభావ ధర్మమున కుదయలోపములుండవు. ఈహేతువులచే జలము స్వభావముచేనుష్ణము కాదని మనకుస్పష్టమైనది. అట్లేబుద్ధియందలి బోధ యొకసమయమున నుదయించుటయు వేఱొండుసమయమున లోపించుటయు ననుభవసిద్ధములు కావునబుద్ధిస్వభావముచేత బోధలేనిదియేయనియు స్వభావముగా జడమ

నియుమనకు స్ఫురించినది కావున మనస్సునకుఁ దెలివిఁ నిచ్చెడునన్యమైనది యొకటి యుండవలె. అదియే యగ్నివలె స్వయంప్రకాశము కావలె ఈబుద్ధి స్వయంప్రకాశముకా నేరదు. స్వయంప్రకాశమైనది యగ్నివలె నెప్పుడు నేకరీతిగానేయుండవలె ఈబుద్ధి యటులలేదు కావున దీనికిఁ బ్రకాశము నిచ్చెడిదే, శుద్ధ చైతన్యము అదియే నీవని భావింపుము. అయ్యది బుద్ధికంటెవిలక్షణమయినదైనను దానికంటె వేఱుగా నొఱలోనుండు నసివలె వివేకముచేఁ దెలిసికొననసాధ్యమయియుండును. ఎందుకనిన నీవు మరకతమణి నొకదానిని బరీక్షార్థము క్షీరమందుంచుము. ఆమణి యాపాలను దనఛాయ (కాంతి) గలవానినిగాఁ జేయును. అట్లే స్వయంప్రకాశమయిన చైతన్యజ్యోతియు బుద్ధియందు వ్యాపించి దానిని దనఛాయగలదానినిగాఁ జేయును. నీవొకకుండలో నీళ్ళుపోసి దానిని బొయిమీదనుంచి క్రింద నగ్ని ప్రజ్వలింపఁజేయుము. అప్పుడు దాని యౌష్ణ్యము మొట్టమొదటఁ దనకు నవ్యవహితమయిన ఘటమందు సంక్రమించును. పిమ్మట నాఘట సంసర్గమువలన నయ్యది నీటియందు సంక్రమించును. అప్పుడానీరే యుష్ణరూపమై కాల్పఁగల్గెడిని. అట్లే బుద్ధియు మిక్కిలి స్వచ్ఛమయిన పదార్థము. అయ్యది యాత్మ కానంతర్యమైనది గనుక చైతన్యజ్యోతి మొట్టమొదట బుద్ధియందే వ్యాపించును. అనఁగా బ్రతిఫలించును. అప్పుడు బుద్ధి విజ్ఞానరూపమై తెలిసికొనఁగలుగును. స్వచ్ఛాయాపత్తిని జెందిన క్షీరములకంటే మరకతము వేఱుగాఁ దెలిసికొన సాధ్యముకానటులఁ జైతన్యచ్ఛాయనుఁ బొందిన బుద్ధికంటేఁ జైతన్యమును వేఱుగాఁ దెలిసికొన మేధావులకును సాధ్యముకానిదై యుండును. అందుచేతనే మేధావులకును బుద్ధియందే యాత్మాభిమానము (బుద్ధియేతానను నభిమానము) లోకప్రసిద్ధమయినది బుద్ధియందు వ్యాపించిన చైతన్యమును దానికంటె వేఱుగాఁదెలిసికొనఁజాలక విజ్ఞానవాదులును క్షణక్షణమందున భ్రమువలె ననేకమార్పులఁజెందు బుద్ధియే యాత్మయని తలఁచుదురు. (క్షణికవిజ్ఞానమేవాత్మేతి బౌద్ధాః) తార్కికప్రాభాకరులును నగ్నిసంయోగమువలన ఘటమందు లౌహిత్యమువలె నాత్మయందు మనస్సంయోగముచేఁ జైతన్యము

పుట్టును. ఆత్మ స్వభావముచేఁ బాషాణప్రాయము. జాగరమునందు మన స్సంయోగవశమున జైతన్యముగలదై విషయములఁ దెలిసికొనఁగలుగు చుండును. సుషుప్తియందు మనస్సు పురీతతినాడిం బ్రవేశించును అందుచే నాత్మకు మనస్సుతో సంబంధములేకపోవును కావున ఆత్మ యేమియును దెలిసికొనఁజాలక పాషాణమువలె జడమై యుండెడిని ఆత్మ యాకాశమువలె విభువు, జడము, అని ప్రలపింతురు. భాట్ట సర్వజ్ఞులును ఆత్మ జాగ రమునఁ దెలివి గలదియై విషయములఁ దెలిసికొనుచుండును సుషుప్తి యందుఁ దెలివిలేనిదై జడభావము చే భాసించుచుండును. కావున ఆత్మ ఖద్యోతమువలెఁ బ్రకాశా ప్రకాశస్వరూపము గలదైనందున జడబోధమని భ్రమంజెందిరి. (ప్రకాశాప్రకాశస్వరూప ఆత్మేతిభాట్టసర్వజ్ఞాః) సాంఖ్య పాతం జలులు మాత్రము బుద్ధిబోధల వివేకముగాఁ దెలిసికొని బోధ మాత్రమేయాత్మ బుద్ధి జడము అని వచించిరి. ఇందుకుఁ బ్రమా ణము (ద్రష్టాదృశిమాత్రః శుద్ధోపిప్రత్యయానుపశ్య. ఇతి పతంజలిః అపరిణామినీహిభోక్తృశక్తిః అప్రతిసంక్రమా చ పరిణామిన్యర్థే ప్రతి సంక్రాంతేవ తద్వృత్తిమనుపతతి తస్యాశ్చప్రాప్త చైతన్యోపగ్రహ రూపాయాః బుద్ధివృత్తేరనుకారమాత్రతయా బుద్ధివృత్త్య విశిష్టాహి జ్ఞానవృత్తి రితిపంచశిఖః॥) ఈయాత్మతత్వ మతీంద్రియము గావునఁ బెక్కు తత్వజ్ఞులును దీనిని యథార్థముగాఁ దెలిసికొనఁజాలక మోహ ముఁ జెందియుండిరి. పూర్వకాలమున మహాపండితుఁడైన విరోచనుఁ డును బ్రజాపతి బ్రహ్మచేబోధించఁబడినవాఁడైనను దీనిని దెలిసికొన లేకపోయెను. ఇందుకొక యాఖ్యాయిక కలదు చెప్పెదనువినుము. ప్రజాపతిబ్రహ్మ "ముదిమిలేనిదియు నాశములేనిదియు శోకరహితమయి నదియుఁ బిపాసలేనిదియు సత్యసంకల్పము కలదియు సత్యకామము కలదియునైన యాత్మయొకటికలదు. అదియే యాచార్యశాస్త్రములచే నన్వేషణముచేయఁదగినదియు స్వసంవేద్యత్వమును బొందించుకొనఁ దగినదియునయియున్నది దీనినాచార్యోపదేశముచేనన్వేషణముచేసి తెలి సికొనెడువాఁడు సర్వలోక కామములను సర్వాత్మత్వమును బొందును

అనిపల్కె..." ఇయ్యది కర్ణాకర్ణికచేఁ బరంపరగా వినఁబడుచువచ్చినది. దీనిని దేవతులు నసురులుఁ బరంపరగావచ్చుచున్న యీయైతిహ్యము ను విన్నవారైరి. అంతట వారు తమతమ సభలయందొండొరులు ప్రజాపతిచేఁ జెప్పఁబడిన యాత్మను వెతకి తెలిసికొందమని ముచ్చ టించుకొనిరి. అంత దేవరాజైన యింద్రుండును నసురరాజైన విరోచ నుఁడును, నిద్దఱు తమతమ పరికరముల వదలి యొండొరులు విద్యను గోరుచు విద్యాఫలమునుబొంద నీర్ష్యను జూపుకొనుచు సమిద్భా రము హస్తమునందుఁ గలవారై ప్రజాపతి బ్రహ్మ సమీపమున కేగిరి. వీరిద్దఱును సహజవైరులు. అట్లయినను విద్యను బొందఁగోరినవారుగాన తమ రాగద్వేషేర్ష్యాదులనువదలి మైత్రిచే ముప్పదిరెండు సంవత్స రములు ప్రజాపతి బ్రహ్మకడ శుశ్రూషాపరులయి బ్రహ్మచర్యవాస మును చరించిరి. అంతఁబ్రజాపతి వారినిఁజూచి మీరేమిప్రయోజన మును గోరుచు నిచ్చట నివసించితిరని యడుగ వారు లోకమునందు శిష్టులు శోకాదులులేని యాత్మ యొకటికలదని మీరు పలికినమాట ను బరంపరగానైతిహ్యరూపముచేఁ దెలిసికొనుచున్నారు. ఆయా త్మను దెలిసికొనఁగోరి యిచ్చట నివసించితిమి అని పలికిరి. అంతఁ బ్రజాపతి వీరల శుద్ధులఁగా నెంచి కంటిలోపలనుండి చూచెడి పురుషుఁ డే నేను వెనుకబల్కినయాత్మయిదియే యవినాశి యిదియే భయహే తువుకానిది ఇదియే బ్రహ్మముఅని బోధించెను. అంత వారామాటను విని కంటిలోపలఁ బురుషాకృతినై చూడఁబడుపాపయేఁ (ఛాయాపురు షుఁడు) ఆత్మయని భ్రమపడి దృఢీకరణముకొఱకు, ఓమహాత్మా ! జల ములందు, అద్దమునందు, ఖడ్గాదియందును, ప్రతిచ్ఛాయ చూడఁబడు చున్నది. మీచేత నుడువబడిన ప్రతిబింబమొక్కటియే వీనియన్నిఁటి లోఁ జూడఁబడుచున్నఁదా లేక దీనికంటె నవిభిన్నములా ? అని తిరిగి యడిగిరి. అంతఁ బ్రజాపతి వీరలు చెప్పినదానిని విపరీతముగా గ్రహిం చిరని తెలిసి కొనినవాఁడైనను వీరలు మహాపండితులు మహాత్మ్యాతి శయముగలవారని లోకప్రసిద్ధి. మీరు భ్రాంతిఁజెందితిరనిపలికినఁజింతా క్రాంతులై తిరిగి ప్రశ్న గ్రహణధారణములందుత్సాహము కలగక పోవు

ను. వీరిప్పుడు విపరీతముగా గ్రహించినను నుపపత్తిచే ముందు పోగొట్టవచ్చునని యెంచియథాశ్రుతప్రశ్నమాత్రమునకేయుత్తరమును జెప్పదలఁచిజలము దర్పణము మొదలగునన్నిటిలోఁ జూడఁబడెడివాఁడు వీఁడేయని వచించి పిదప వీరిభ్రమను వారింపఁదలఁచి జలపూర్ణమైన శరావము మొదలగువానియందు మీస్వరూపములను జూచుకొని దాని విషయమై మీకేమి తెలియదో దానినడుగుడనిపల్కె. వారును నటులనే వానియందుఁ దమ రూపమును జూచుకొని బదులు పల్కకనేయుండిరి. అంతఁ బ్రజాపతి ఛాయాత్మయందే వీరికి దృఢనిశ్చయము గల్గినదని దెలిసికొని వారడుగక పోయినను మీరేమిచూచితిరని తానే ప్రశ్న చేసె. లోమనఖాది సహితమైన మాప్రతిబింబములనే యిందుఁజూచితిమని పల్కిరి. పిదపఁ బ్రజాపతి యింటియందువలె నిచ్చటను సుందరములైనవస్త్రములను భూషణములను నలంకరించుకొని భిన్నములైన లోమనఖములుగలవారై తిరిగి జలపూర్ణములైన శరావములందు మీరూపములను వీక్షించుఁడని పల్క వారును నటులనే వానియందుఁ దమరూపములఁ జూచుకొనిరి. శరీరసంబద్ధములును నాగంతుకములునునైన వస్త్రాదులకు ఛాయాకరత్వమువీనియందుఁ జూడఁబడుచున్నది. అటులనే ఈ శరీరమునకును ఛాయాకరత్వము జూడఁబడుచున్నది. శరీరముయొక్క యేకదేశములును, నఖండితములునునైన లోమనఖాదులు ఛాయాకరములై చూడఁబడినవి. ఇప్పుడు ఛిన్నములైనలోమనఖములకు ఛాయాకరత్వము చూడఁబడుటలేదు. కావున లోమనఖాదులకువలె శరీరమునకును నాగమము నపాయముసిద్ధించినది. శరావమునందుఁ జూడఁబడెడి ప్రతిఛ్ఛాయకుఁగాని దేహమునకుఁగాని యమృతత్వముసిద్ధించదు. కనుక యీరెండును భయహేతువులే. ఇవి యాత్మకానేరవని వివేకముగాఁ దెలిసికొనలేక ఛాయాపురుషుఁడే యాత్మయని దృఢనిశ్చయముగలవారైరి. ప్రజాపతి మీరేమిచూచితిరని తిరుగనడుగ వారు వెనుకటివలె మా ఛాయాస్వరూపములనే చూచుచుంటిమని ప్రత్యుత్తరమీయఁ బ్రజాపతి వీరు పండితులైనను నేదోయొక దోషముచే వివేక ముదయించలేదు. ఇప్పుడు శరావాద్యుపపత్తిచేతను నక్షురు

షోపదేశముచేతను నైతిహ్యాముచేతను సంస్కరించఁబడిరి. దీనినేపౌనః పున్యముచే మనన మొనరించి నవివేక ముదయించును. పిదప వారే నిజ మైన యాత్మను దెలిసికొనఁగలరని తలఁచుచు నిదియే నేను పల్కిన యాత్మ. ఇదియే యవినాశి ఇదియే బ్రహ్మము అని బోధించె. అంతఁ కృతార్థులమైతిమని యెంచిపోవుచున్న వారిని బ్రజాపతి తిరిగి బ్రహ్మచ ర్యమునాదేశించితినేని దుఃఖముకల్గునని భావించి యుపేక్షించెను. వీరు భ్రాంతిచేత నే నుపదేశించినదానిని విపరీతముగా గ్రహించిరి. వీరు భో గాసక్తులు. ఈయుపదేశమును మఱచిచెడిపోదురు. అని శంకించి తిరి గి బ్రహ్మచర్యవాసము నాదేశింపక వెనుక నేను బలికిన వచనమువలె దీనిని గూడఁ గర్ణాకర్ణికచే వినఁగలరని తలఁచి ప్రజాపతియు చాలదూ రమందుఁబోవుచున్న వారింజూచియ ప్రత్యక్షముగా నిట్లు వచించె. "ఇం ద్రవిరోచను లిద్దఱు యథార్థమైన యాత్మనుగనుగొనలేక విపరీత ఛ్ఛా యాత్మయందు నిశ్చయముగలవారై వెళ్లుచున్నారు కనుక దేవతలుగా ని, యసురులుగాని యెవరైతే వీరివిద్యను గ్రహించి యిటువంటి విజ్ఞా నముగలవారగుదురో వారు శ్రేయోమార్గమునుండి భ్రష్టులయి నశిం చెదరు" స్వగృహమునుగూర్చి యేగుచున్న సురాసురరాజులలోపల నసురరాజైన విరోచనుఁడ సురులసమీపమునకుఁబోయి "ప్రజాపతిచే దేహమే యాత్మయని యుపదేశింపఁబడెఁగావున దేహమ్మే యాత్మ. దే హమే పూజనీయము. దేహమును పూజించినవాఁడు ఉభయలోకముల నుబొందును" అని వారికుపదేశించెఁ గావునసే దేహాత్మసంప్రదాయ ము లిప్పటికి లోకమందుఁ జూడఁబడుచున్నవి. ఇంద్రుఁడు దేవతలను బొందకయే ప్రజాపతిచేఁ జెప్పఁబడిన యుదకశరావాద్యుపదేశమును స్మరించుచునే తాను గ్రహించిన ఛాయాత్మయందు దోషమును జూచె ను. శరీరమలంకరించఁబడిన ఛాయాత్మయు నలంకరించఁబడుచున్నది. శరీరముఛిన్ననఖరోమాద్యవయములుగలదియైన ఛాయాత్మయు నఖరో మాదిరహితమైనదై చూడఁబడుచున్నది. దేహావయవములన్నియుఁ దు ల్యములు గనుక దేహమంధమైన ఛాయాత్మమంధమగును. దేహము న శించిన ఛాయాత్మయు నశించును. కావునఛాయయునాత్మగాఁ జనదు,

శరీరముకూడ నాత్మ కాఁజనదు. ఈరెండును నశించెడివికావునభయహే తువులే, వీనివలన నిష్టమైనఫలము పొందఁబడుటలేదు. అనివానియం దు దోషముచూచి సమిత్తులు పాణియందుఁగలవాఁడై తిరిగి బ్రహ్మ చర్యవాసముకొఱకు ప్రజాపతికడ కేఁగె. అంతఁ బ్రజాపతి "ఓయింద్రుఁ డా! నీవు శాంతమనస్సుగలవాఁడవై విరోచనునితోఁగూడ గృహమున కేఁగితివి దేని నభిలషించుచుఁ దిరిగివచ్చితివని యడుగ నింద్రుఁడు తాను ఛాయాత్మయందుఁగన్న దోషమును ఉద్ఘాటించి యందిష్టఫలావాప్తి కలుగలేదు. ఆత్మయవినాశియని ఉపదేశించితిరి ఆయాత్మను దెలిసి కొన నిచ్ఛయించుచున్నాఁడను అని పల్కె. ప్రజాపతి నే నుపదేశిం చిన యాత్మ ఛాయాపురుషుఁడుకాఁడు. నేను చెప్పినదాని నేదియో యొక దోషముచే నశింపఁజేయఁబడిన గ్రహణసామర్థ్యముగలవాఁడవై తెలిసికొనఁజాలవైతివి. ఆ దోషమును నశింపఁజేయుటకొఱకు తిరిగి ద్వాత్రింశద్వర్షములు బ్రహ్మచర్యవాసమును జేయుము, అని యాజ్ఞాపిం చెను. ఇంద్రుఁడటులనే చేసెను. అంతఁ బ్రజాపతి యింద్రునకిట్లుపదే శించె. స్వప్నమునఁ జరించువాఁడును వివిధములైన భోగముల ననుభ వించువాఁడునునైన స్వప్నదర్శియే నాచేఁజెప్పఁబడిన యాత్మ దానిని విని శాంతమనస్సుగలవాఁడై యింటికేఁగెను. పూర్వమువలె దేవతలను బొందక మార్గమధ్యముననే స్వప్నద్రష్టయందును దోషమునుగనె. ఏమి యనినఁ గొందఱితనిని హింసించుచున్నవారువలెఁ గనఁబడుచుందురు. ఇతఁడప్రియమును దెలిసికొనెడివానివలెనుండును. రోదనముచేయువాని వలెనుండును. ఇదిదేహమువలె నశించెడిది కాకపోయినను భయకారణమైనదే. దీనియందును నిష్టమైన ఫలముపొందఁబడుటలేదు. ప్రజాప తియుపదేశించినది యభయమైనదియని తలఁచి తిరిగి సమిత్తులు పాణి యందుఁగలవాఁడై ప్రజాపతికడకేఁగె. ప్రజాపతియు నీవుదేనినిచ్ఛయిం చుచుఁ దిరిగివచ్చితివని యడుగఁ దాను స్వప్నద్రష్టయందుఁగన్న దోష మును బ్రకటనచేసె అంతఁ బ్రజాపతియతని హృదయమునుగని తిరిగి ద్వాత్రింశద్వర్షములు బ్రహ్మచర్యమును జరింపుమనిపలికె. అట్లేయిం ద్రుఁడు చేసె. పిదపఁ బ్రజాపతి యతనికిట్లుబోధించె. సుషుప్తిఁజెంది

స్వప్నము గనక నిర్మలమై సుఖము ననుభవించువాఁడే నాచేఁ జెప్పఁబడినవాఁడును నక్షియందుండి చూచువాఁడును స్వప్నమున జరించువాఁడునునైన యాత్మ. ఇదియే నాశములేనిది. అభయమైనది. దీనినివిని యింద్రుఁడు శాంతమనస్సుతో గృహమున కేగుచు దేవతలను బొందకయే తిరిగి సుషుప్తిని దెలిసికొనువాఁడు తనను నితరులను నెఱుఁగక విశేషవిజ్ఞానరహితుఁడై చూడఁబడుచున్నాఁడు. ఇతఁడును వినాశప్రాయుడే కావున నితనియందును నిష్టఫలమును జూడనైతినని యతనియందునుదోషముఁజూచి ప్రజాపతికడ కేగె. ప్రజాపతియునీవెందుకుతిరిగివచ్చితివని యడుగ సుషుప్తిదర్శియందుఁదానుఁగనిన దోషమును వెల్లడించి తన యిష్టఫలము పొందఁబడలేదని యింద్రుఁడు చెప్పె. ప్రజాపతియుఁ దిరిగి పంచవర్షములు బ్రహ్మచర్యమును జరించుమని పల్క నింద్రుఁడట్లే చరించె. పిదపఁ బ్రజాపతియతనికిట్లు బోధించె. ఓయింద్రుడా ! స్వప్న,జాగర, సుషుప్తులను దెలిసికొనెడివానియొక్క స్వరూపభూతమైన తెలివియే నిజమైన యాత్మ. ఇదియే సూర్యుడుమంచుచేతనువలె నజ్ఞానముచేతఁ (మాయచే) గప్పఁబడియున్నది. అందుచే స్వరూపమునుమఱచి స్వప్నజాగరములందుబుద్ధిసంబంధముచేత నింద్రియములద్వారమున రూపాదివిశేషజ్ఞానముగలదగుచుండును. సుషుప్తియందు వాయువు విద్యుత్తు మేఘమువర్షాకాలవసానమం దాకాశసామ్యముఁబొందునట్లు జ్ఞానసామ్యమును బొందితాను యితరులు, అనువిశేషజ్ఞానము లేనిదిమై యుండెడిని. విశేషవిజ్ఞానము లేకపోయినమాత్రముచే సుషుప్తియందాత్మ నశించునని తలచకుము. శ్రవణమననాదిధర్మము లాత్మవికావు. స్ఫటికమునందు లౌహిత్యాది ధర్మములవలె నాత్మయందవి చూడఁబడినను నాత్మవానిచేత స్పృశింపఁబడదు నదియందు మహామత్స్యముబోలి నాత్మ యన్నియవస్థలలోనసంగమై సంచరించుచుండును. స్వప్నమునందుఁ బ్రియాప్రియాది ధర్మములును దానినంటవు. ఈమూడవస్థలలో నాశుద్ధమునుదెలివి రూపమునునైన యాత్మయే సత్యమైనది. నేనక్షియందుమీకుపదేశించినదియు నదియే ఈఛాయాపురుషుని నేను ఉపదేశించలేదు. నీవు విపరీతముగా దానిని గ్రహించితివి స్వప్నసుషుప్తులందు

నుదానినేచెప్పితి అదియేనీవు అదియేనాశనములేనిది అదియే భయహేతువుకానిది అదియే బ్రహ్మము అదియేతురీయము. వెనుక నేఁబలికిన దియు నదియే జాగరాదులందుఁ జూడఁబడు జ్ఞాతృత్వాదిధర్మములు సుషుప్తియందు నశించినను నీ తెలివిమాత్రము నశించుటలేదని భావించుము. ఇట్లు ప్రజాపతిచే బోధింపఁబడినవాఁడై యింద్రుఁడు చతుర్థపర్యాయమునఁ బ్రథమోక్తమైన బ్రహ్మమును దెలిసికొనెను. కావున సూక్ష్మబుద్ధిచే నీస్వరూపమును దెలిసికొనుము. నీస్వరూపముసర్వాంతరమైనది, దానికి మొట్టమొదట బుద్ధియందే ప్రతిఫలనము. తర్వాత మనస్సు బుద్ధికంటె స్థూలమును, అనంతరమందుండెడిదియుఁ గనుక మనస్సునందు బుద్ధి సంసర్గచేతనే చైతన్యముయొక్క యవభాసతకలిగెడిని. పిమ్మట దానికంటె స్థూలమును ననంతరమందుండెడివియుఁ గనుక నామనస్సంయోగమువలన నింద్రియములందుఁ జైతన్యావభాసత్వము. పిమ్మటవానికంటె స్థూలమును నానంతర్యమైనదియుఁ గనుక నింద్రియసంబంధముచేత శరీరమందుఁజైతన్యావభాసతకలిగెడిని. ఈరీతిని చైతన్యజ్యోతి స్థూలసూక్ష్మతారతమ్యముచేఁ బరంపరగా దేహేన్ద్రియాది సంఘాతమును వ్యాపించియుండినందున దేహాదిసంఘాతము చేత నావత్తు

శరీరం ఆత్మానభవతి.

వలెఁగనఁబడుచుండును. చైతన్యము (విషయములఁదెలిసికొను తెలివి.) ఈ స్థూలశరీరమునకు స్వభావమైకాఁజనదు. ఎందుకనిన, ఎప్పుడును దెలియఁబడుదానికంటెను దెలిసికొనునది భిన్నమయియెయుండవలె.

నీవుఘటమునుదెలిసికొనెదవు. ఆఘటమునీవగుదువా? కావు. నీవువేదితవు అదివేద్యము. ఆవేద్యమయిన ఘటముకంటె నీవువేఱు. అట్లేనా శరీరము, అని యీశరీరమును. నీవుదెలిసికొందువు అయ్యదినీకు వేద్యము కావున దానికంటెనిన్ను వేఱుగా భావింపుము. ప్రత్యక్షముగా నీసంఘాతరూపమైన శరీరమే విషయములఁ జూచుచున్నది. వినుచున్నది. తలఁచుచున్నది. ఈశరీరముకంటె వేఱుగాఁ జూచువాఁడు మనకగపడుటలేదు కావునఁ జూచుచున్నదియుఁ దెలిసికొనునదియు నీశరీరమేయని పలికితివేని ద్రష్ట (చూచువాడు) జాగ్రద్దృష్ట పదార్థములనే

స్వప్నమందుఁ జూచును. జాగ్రత్తునందుఁ జూచుచున్నది. ఈశరీరము స్వప్నమంది య్యదిచూచుటలేదు. పూర్వదృష్టపదార్థమే స్వప్నమందుఁ గనఁబడునుగాని యదృష్టాపూర్వపదార్థము కనుపించదు. ఇట్లుండ జాగ్రత్తునందుఁ జూచునదియొకటి స్వప్నమందుఁజూచునది వేఱొకటియని సిద్ధించినది ఆన్యునిచేదృష్టమయినది యన్యునికి స్వప్నమందుఁ గనుపించుట సంభవించదు. ఎవఁడు జాగరమునదేనిని జూచునో వానికేయది స్వప్నమునఁ గనఁబడును. గనుక స్వప్నమును జూచువాఁడెవఁడోవాడే జాగ్రత్తును జూచుచున్నవాఁడని మనము చెప్పవలెనుగాని యీదేహముచూచుచున్నదియని చెప్పుటకువీలులేదు. కనుకస్వప్నజాగరములను జూచువాఁడీ దేహముకంటె నతిరిక్తుఁడనియే రూఢమైనది జాగ్రత్తునందుఁజూచినదానినే ద్రష్ట స్వప్నమందును జూచును. అపూర్వమును స్వప్నమందుఁ జూడఁడని యెందుకుఁ జెప్పలె. అంధుఁడు జాగరమునందు నేత్రములతోఁ జూచుటలేదు. స్వప్నమందు వాఁడు అనేకపదార్థములఁ జూచుచున్నాఁడు. కనుక వెనుకఁ జూడఁబడినపదార్థమేస్వప్నమందుఁ జూడఁబడును. అనుహేతువ ప్రమాణమనిపలికితివేని యాయంధుఁడును వెనుక నేత్రములుండిన కాలమునఁ జూచినవానినే యిప్పుడు స్వప్నమందుఁ జూచుచున్నాఁడు కాని చూడనిద్వీపాంతర పదార్థములవాఁడుచూచుచున్నాఁడా? లేదు. కనుక నంధుఁడు స్వప్నమందుఁ జూచుపదార్థములును వెనుక నేత్రములుండునపుడు చూడఁబడినవియేకాన స్వప్నముదృష్టపూర్వమేయనునది ప్రామాణికము లోకములోఁ జూచువాఁడే స్మరించువాఁడు ఒకఁడుచూచిన వేఱొకఁడెప్పుడును స్మరించఁజాలఁడు దృష్టస్మృతులు రెండును నొకనియందే కనఁబడుచుండును. నిమీలితాక్షుఁడును స్మరించుచు వెనుకఁజూచినదానినేచూచుచుండును. నిమీలనసమయమునందుఁ జూచునది యీశరీరముకానేరదు. కావున నేత్రనిమీలనమందును స్మరించుచు దృష్టపదార్థమును జూచునదియేదియో యదియే నేత్రము న్మీలితమయి నప్పుడును జూచుచున్నదియని తెలియఁబడుచున్నది. స్మరించువాఁడే చూచువాఁడు కావలెను దేహమే యాత్మయని పలికితివేని దేహము నేత్రోన్మీలనమందే చూడఁగలుగునుకాని

నేత్రనిమీలనమందుఁ జూడఁజాలదు. నేత్రనిమీలనమున దేహాతిరిక్తమ యినవాఁడే స్మరణకువచ్చినవానిని జూచుచుండును నేత్రనిమీలనమందు స్మరించిచూచునదియే నేత్రోన్మీలనము నందును జూచునదియుఁ దెలిసికొనునదియుఁ గావలయునని నయ్యది ఈదేహముకంటె నతిరిక్తమే యనియుఁ దేలినది. ఎవఁడు చూచుచున్నాఁడో వానికే స్వప్నముగాని స్మృతిగాని కలుగుచుండును (స్వప్నస్మృత్యోర్దృష్టస్యైవదర్శనాత్ స్వప్నస్మృతి ద్వయస్య ఏకస్యైవానుభవాత్ దేహాత్మవాదేతన్న సంభవతి) దేహము చక్షుస్సుండు నపుడేఁచూడఁగలుగును. ఉద్ధృత చక్షుస్సులు గలవాఁడును స్వప్నమందు దృష్టపదార్థములనే చూచుచున్నాఁడు. జాగరమునందీ దేహమేచూచునది యయినచోనుద్ధృత చక్షుస్సులు గలవాఁడు స్వప్నమందు దానినిజూడకపోవలె దేహమే ద్రష్టయనిపలికిన మతియొకదోషమును గలదు. మృతశరీరమ వికలముగానున్నను రూపాదులు చూచుటలేదు. కావున నేదియుండగా దేహముచూడఁ గల్గునో యేదిలేనిచోఁ జూడఁజాలదో యయ్యది దానికంటె నతిరిక్తమని తేలుచున్నది. (యదపాయేదేహే దర్శనం నభవతి యద్భావేచ భవతి తద్దర్శనాది క్రియాకర్తృన దేహ ఇత్యవగమ్యతే॥ ఇన్ద్రియ

నేంద్రియమాత్మా.

ములకును చైతన్యము స్వభావగుణముకాదు. అనఁగా నవియును స్వభావముగా స్వవిషయములఁ దెలిసికొనఁజాలవు. నీవు మనస్సునేదోయొక ధ్యానములోనుంచుము. అప్పుడునీయెదురుగా నొకమనుజుఁడు పోవుచున్నను నామనుజుని నీచక్షుస్సునీక్షలనము చేయఁ బడినను దెలిసికొనఁజాలదు ఇటులనే నీవేకాగ్రముతో నొకగ్రంథముఁ జదువుచుండుము. అప్పుడుసమీపమందు గడియారముగంటలు కొట్టుచున్నను నీశ్రోత్రేన్ద్రియమాశబ్దమును విశేషముగాఁ దెలిసికొనఁజాలదు. చక్షుస్సునకుగాని శ్రోత్రమునకుఁగాని యారూపశబ్దముల నభివ్యంజనచేయు చైతన్యశక్తి స్వభావసిద్ధమైనచో నయ్యదియెప్పుడును వానినంటుకొనియే యుండవలె. నీమనస్సు ధ్యానములోనుంచి మరలించుము. అప్పుడునీవుముందరనుండెడి మనుజుని దెలిసికొనఁగలుగుదువు. గ్రంథము చదువుటవదలి యేకా

గ్రతలోనుంచి నీమనస్సుతొలగినవెంటనే శ్రోత్రేంద్రియము శబ్దమును విశేషముగా దెలిసికొనఁ గలుగును గావునమనస్సుయొక్క సంయోగము వలననే యింద్రియములకుఁ దత్తద్విషయముల నభివ్యంజనచేయు చైతన్యశక్తి కలుగుచుండును. వానికయ్యది స్వభావముగా లేదని రూఢిగాఁ దెలిసికొనుము ఇంద్రియములే స్వభావముచే స్వవిషయముల దెలిసికొనునన్న వెనుకఁ జూచినదానినే యిప్పుడునేను దాఁకుచున్నాను (యదహమ ద్రాక్షంతత్స్పృశామి) అని ప్రాణులుపలుకుదురు వెనుకఁజూచినది నేత్రము ఇప్పుడు తాఁకుచున్నది త్వగింద్రియము చూచినదియొకటి. తాకుచున్నది యొకటి. అటులయినఁ జూచినదానినే నేను స్పృశించుచున్నానను ప్రతి సంధాన ముపపత్తి కానేరదు కావునఁ జూచుచున్న వాఁడుఁ దాఁకుచున్న వాఁడునునీయింద్రియములకంటెనతిరిక్తుఁడనియె తెలిసికొనుము. అవ్వాఁడు చక్షుస్సుద్వారమునఁ జూచును. త్వగింద్రియముల ద్వారమున స్పృశించును అనిచెప్పితివేని యాప్రతీతి యుపపత్తియగును. ఈవిమర్శనముచే నీశరీరమునకుఁగాని మనస్సునకుఁగాని యింద్రియములకుఁగాని చైతన్యము. (అనగా విషయముల దెలిసికొను తెలివి) స్వాభావికము కాదనియు వానికయ్యది యాగంతుకమనియు సిద్ధమయినది. ఈమన యింద్రియముల కతిరిక్తమై వానికిఁ బ్రకాశము నిచ్చెడిదియును నెప్పుడును లోపించనిదియును స్వయంప్రకాశమయినదియును నొకటి యుండవలెనని యీయనుమానప్రమాణముపలనఁ దెలిసికొనుచున్నాము.

జాగరేప్యాత్మా స్వయంప్రకాశః.

స్వప్నమందు బుద్ధీంద్రియములకుఁ బ్రకాశమునిచ్చెడి జ్యోతి యభౌతికము అతీంద్రియము జాగరమున జగద్భాసకములైన యాదిత్యాది జ్యోతిస్సులు భౌతికములు సేంద్రియములు స్వాప్నిక వ్యవహారముచే ననుమేయమయిన యాంతరజ్యోతి వీనికంటే విలక్షణము, చైతన్యరూపము, అని తెలిసికొనుము. ఆచైతన్యమే నీవు. అదియే యన్నియవస్థలలోను స్థిరముగా నుండెడిది. జాగరమునందాదిత్యజ్యోతిచేతఁగాని చంద్రజ్యోతిచేతఁగాని దీపముచేతఁగాని శబ్దాదివిషయ

ములచేతఁగాని పదార్థములను బురుషుఁడు దెలిసికొనుచుండును వీని కంటె నతిరిక్తమయిన యన్యజ్యోతిచేఁ బదార్థములఁ దెలిసికొనుచుండు నట్లు కనఁబడుటలేదు. స్వప్నములోనైతే బాహ్యజ్యోతిస్సులు లేనందున స్వాప్నికపురుషవ్యవహారముచేత వీనికంటెనతిరిక్తమయినయాంతరజ్యోతి యొకటి యనుమేయమైయుండెడిని జాగరమునందాదిత్యాది జ్యోతిస్సులువినా కేవలచైతన్య జ్యోతిచేతనే ఘటాదుల మనము తెలిసికొనుచున్నామా, తెలిసికొనుటలేదు. ఆదిత్యజ్యోతిచేతఁగాని చంద్రజ్యోతిచేతగాని,దీపాదిజ్యోతిస్సులచేతగాని విషయములుప్రకాశింపఁజేయఁబడినప్పుడీపురుషుఁడు వానిఁదెలిసికొనగలుగును కావున స్వప్నములో చైతన్యజ్యోతి స్వయంప్రకాశమయినను జాగరమునందు స్వయంప్రకాశస్వభావముకలది కానేరదు. జాగరమునం దాత్మకు సర్వావభాసకత్వము (అనగా సర్వము దీనిచేఁ దెలిసికొనఁబడుట) స్వయముగా ననన్యావభాస్యత్వమెట్లుసిద్ధించును. ఆదిత్యచంద్రాది జ్యోతిస్సులచేతనే యింద్రియాదులు భాసింపఁజేయబడినవై స్వవిషయములఁబ్రకాశింపఁజేయఁగలిగెడిని. స్వప్నమందైతే యింద్రియములఁ ననుగ్రహించెడి బాహ్యజ్యోతిస్సులు లేనందున సంఘాతపురుషుఁడుజాగ్రత్తునందువలెనతిరిక్తజ్యోతిస్సుచేతనే ప్రకాశింపఁజేయబడి విషయముల దెలిసికొనుచుండును గనుక అప్పుడు చైతన్యజ్యోతికి సర్వావభాసకత్వము స్వయమనన్యావభాస్యత్వము సిద్ధించినను జాగరమునందాదిత్యాది జ్యోతిస్సులుండుటచే చైతన్యజ్యోతి.యకించిత్కరమైనందున స్వయంప్రకాశము కాఁజాలదని పలికితివేని ఆదిత్యాది జ్యోతిస్సులు సంఘాతములు జడములు అయినందున పర్యంక శయ్యాదులవలెఁ బరార్థములు. దేహేంద్రియములకు స్వభావముగాఁ జైతన్యము లేదు మనస్సంబంధమువలన నయ్యది కలుగు నని తెలిసికొంటిమి పరార్థములయిన బాహ్యజ్యోతిస్సులకు స్వార్థోపపత్తి కలుగనేరదు. స్వార్థమయిన చిజ్జ్యోతియొక్క యవభాసనము దేహబుద్ధీంద్రియాది సంఘాతమునకు లేనియెడల సంఘాతాత్మ బాహ్యవిషయములఁ దెలిసికొనఁజాలఁడు. బుద్ధిద్వారమున బరంపరగాఁ జైతన్యజ్యోతియొక్క యవభాసముచేతనే సంఘాతాత్మ సర్వవ్యవహా

రము తెలిసి చేయఁగలఁడు. ఇందుకుఁ బ్రమాణము శ్రుతి "యదే తద్ధృదయంమనశ్చైతత్సంజ్ఞానం" ఇత్యాది బాహ్యమున నొకఘటము కలదు దానిని నీవెట్లు తెలిసికొనఁగలుగుదువు ? ప్రప్రథమమున నంతఃకరణము స్వచ్ఛమును మిక్కిలి సన్నిహితమైనందున దానియందే చైతన్యోపలబ్ధి కలుగును. దాని సంసర్గద్వారమునఁ జక్షురింద్రియము చైతన్యముచేఁ బ్రకాశింపఁజేయఁబడును. అప్పుడు దానికి సూర్యాద్యాలోకము సహాయము కావలెను. తదాలోకసంయుక్తమైన చక్షురింద్రియద్వారమున ఆంతరమయిన మనస్సు బహిస్థమైన ఘటముతోఁ గలిసికొనును (అనఁగా మనస్సుయొక్క వృత్తిరూపప్రకాశము ఘటముతో వ్యాపించును). పిమ్మట పురుషుఁడు యిది ఘటమని తెలిసికొనును ఘటమును దెలిసికొనుటకు సూర్యునియొక్క ప్రకాశమును చక్షుస్సపేక్షించినను జైతన్యముజేఁ బ్రకాశింపఁ జేయఁబడియే స్వవిషయమును నభివ్యంజనము చేయుచుండును కావున సంఘాతపురుషుఁడు చైతన్యముచేఁ బ్రకాశింపఁ జేయబడియే జాగరమునందును బాహ్యవిషయములఁ దెలిసికొనుచుండును. చక్షురింద్రియము సూర్యప్రకాశానుగ్రహము గలిగినదైనను చైతన్యముచే బ్రకాశింపచేయఁబడుచునే యుండును మఱియు వీఁడుఘటముదెలిసికొనవలెననినవీనికి సూర్యప్రకాశము కావలెను ఆసూర్యునిదేనిచే వీఁడు తెలిసికొనుచున్నాఁడు ? చైతన్యజ్యోతిచేతనేకదా అచ్చట వీనికి నే యితర ప్రకాశమక్కరలేదు. సూర్యాదిజ్యోతిస్సు లితరములయిన ఘటాదులఁ బ్రకాశింపఁ జేయుచున్నవైనను ఘటాదులవలెఁ జైతన్యముచేఁ దెలిసికొనఁబడుచున్నందునఁ జైతన్యజ్యోతియొక్క నిరతిశయస్వయంజ్యోతిష్ట్వమునకు బాధకములేదు. అట్లే ప్రదీపమును, ఇతరములను బ్రకాశింపఁ జేయునదియైనను ఘటమువలె స్వయము చైతన్యముచేఁ దెలిసికొనఁబడును. అనగా నచ్చట ప్రదీపముకలదని దెలిసికొనునది చైతన్యాత్మయె దీపమును దీపమెప్పుడు దెలిసికొనఁజాలదు. చంద్రాది జ్యోతిస్సులును వానినవి తెలిసికొనఁజాలవు, వానినిఁ దెలిసికొనునది చైతన్యజ్యోతియే. అదియేనీవు ఆదీపాదిజ్యోతిస్సులఁ దెలిసికొనుటకు నీకు దేనిప్రకాశము కావలసివచ్చును ? ఆత్మ

ప్రకాశమేకదా ఇట్లుండ జాగ్రద్దశయందీ చైతన్యజ్యోతి యాదిత్యాది జ్యోతిస్సులతో వ్యాప్తమై యుండును గనుక ముంజవలన నిషీకనువలె వేఱుగాఁ బురుషుఁడు తెలిసికొన సాధ్యముకాదని యితర జ్యోతిస్సుల స్తమించు స్వప్నవేళయందే శ్రుతియును నీయాత్మకు నిరతిశయ స్వయంప్రకాశ రూపమునుఁ జూపించె ఈ దేహమునకుఁ గాని, ఇంద్రియములకుఁగాని, బుద్ధికిఁగాని, చైతన్యము స్వభావముగా లేదు. చైతన్యజ్యోతి మొట్టమొదట బుద్ధిని భాసింపఁజేయును తద్వారము ననింద్రియముల, తద్వారమున దేహమును, ఇటులస్థూలసూక్ష్మతారతమ్యముచేఁ బరంపరగా దేహబుద్ధీంద్రియాది సంఘమును క్షీరమును మరకతమణివలె నేకీభావమును జెందించి చైతన్యముగలదానినిగాఁజేయును అందుచే నీదేహేంద్రియాది సంఘాతము చైతన్యముగలదివలెఁ గనఁబడుచుండును. స్వభావముగా దేహేంద్రియాదులు జడములు ఇందుకుఁ బ్రమాణముశ్రుతి "యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత। యదాదిత్యగతం తేజః ఇత్యాది చ గీతాయాం" "నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం" ఇతి "త మేవభాం తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" ఇతిచ కాఠకే "యేనసూర్యస్తపతి తేజసేద్ధః" ఇతిచ మంత్రవర్ణః "శ్రోత్రస్య శ్రోత్రం మనసోమనఇతిచ" కేనోపనిషది॥ బుద్ధియవభాస్యము, ఆత్మయవభాసకము, సూర్యప్రకాశము ఘటమును వ్యాపించి యుండునప్పుడాప్రకాశమును ఘటముకంటె వేఱుగావివేచనముతో నీవు తెలిసికొనఁజాలవు ఆ ప్రకాశము శుద్ధమైనను, అవభాస్యమైన ఘటముతో సదృశమైనదగును ఆప్రకాశము రక్తపదార్థమును వ్యాపించిన రక్తాకారముగాఁ గనఁబడుచుండును హరితపదార్థమును బ్రకాశింపఁజేయుచు హరితాకారముగాఁ గనఁబడుచుండును నీలమును బ్రకాశింపజేయుచు నీలాకారముగనే కనఁబడుచుండును. రక్తపదార్థమును బ్రకాశింపఁజేయు ప్రకాశము రక్తాకారముగాఁ గనఁబడినను స్వభావముచే నయ్యది శుభ్రము, కానిరక్తముకాదు అని నీవు తెలిసికొనవలె, అట్లేపాలనుమరకతమణివలె బుద్ధీంద్రియాది సంఘమును నీచైతన్యరూప

మేకీభవించి చైతన్యముకలదానినిగాఁ జేయుచుండును. నీచైతన్యస్వరూపము స్వభావముచేఁ బ్రకాశమువలె శుద్ధమైనది అదియే బుద్ధినిభాసింపఁ జేయుచు బుద్ధిసదృశముగాఁ గనఁబడును అనఁగా బుద్ధిధ్యానించుచున్న నీ చైతన్యరూపమును ధ్యానించుచున్నదివలెఁగనఁబడును బుద్ధిమోహము పొందుచున్న నదియును మోహముపొందుచున్నదివలెఁ గనఁబడుచుండును బుద్ధిచలించుచున్న నదియుఁ జలించుచున్నదివలెఁ గనఁబడుచుండును. అందుచేత నేలోకమునకు భ్రాంతి కలుగుచున్నది వాస్తవముగా నీచైతన్యరూపము చింతించుటయు లేదు. మోహమునుబొందుటయు లేదు చలించుటయు లేదు బుద్ధి,యింద్రియములద్వారమున విషయములఁ జూచుచున్న నీవును జూచుచున్న వాఁడవుగా గనఁబడుచుందువు. బుద్ధివినుచున్న నీవును వినుచున్న వాఁడవుగాఁగనఁబడుచుందువు. అదిస్వాపవృత్తిఁజెంది నిదురబోవుచున్న నీవును నిన్ను నిదురబోవువానినిగాఁ దెలిసికొనుచుందువు అదిమేలుకొనుచున్న నీవును మేలుకొనుచున్న వానినిగా నిన్ను దెలిసికొనుచుందువు. అది స్వప్నవృత్తిఁజెంది వాసనాత్మక విషయములఁ జూచుచున్న నీవును నిన్ను వానినిజూచునున్న వానినిగాఁ దలచుచుందువు శరీరము భాసింపఁజేయుచు నీవుశరీరసదృశుఁడవగుదువు శరీరముస్థూలమగుచున్న నీవునిన్ను స్థూలునిగాఁదెలిసికొనుచుందువు. శ్రు॥ రూపం రూపం ప్రతిరూపోబభూవ॥ పరమార్థముగా నీవుస్థూలుడవుకావు వినువాడవుకావు చూచువాడవుకావు అవియన్నియు నుపాధిధర్మములు శరీరము నీవనుకొనుట, చూచుచున్నాను, వినుచున్నాను, అనియనుకొనుట, మొదలగుధర్మములన్నియునీవికావు. నీవుస్వభావముచే వినువాఁడవు చూచువాఁడవు తెలిసికొనువాఁడవు కావు నీవుస్వభావముచే శుద్ధచైతన్యరూపుడవు అట్టినీవు, ఈజడమైన హస్తపాదాది మత్తైన శరీరమెటులగుదువు నాశరీరము అని నీవు పలుకుచుందువు శరీరము వేద్యము నీవువేదితవు వేద్యవేదితలు, ఎప్పుడును, ఒకటి కానేరవు (తెలిసికొనఁబడెడిదానికంటెఁ దెలిసికొనెడిది యతిరిక్తమే). దానికంటె నీవతిరిక్తుడవైనను నిన్ను వేఱుగా విమర్శనముతోఁ దెలిసికొనఁజాలక మోహమునుబొందుచుందువు. ఏమియజ్ఞానము! నాబుద్ధియని నీవు పలుకుచుందువు

దానికంటె నిన్ను వేఱుగాఁ దెలిసికొనజాలవైతివి. బుద్ధియే నీవైతివేని నా బుద్ధియని నీవెటుల పలుకగలిగెదవు నేను బుద్ధినియని నీవు పలుకవలె నటుల లేదు కావున దానియును దెలిసికొనుచుండువాఁడవు నీవు కనుక దానికంటె నిన్న తిరిక్తుఁనిగా భావించుము. నీవు స్వభావముచే చైతన్యజ్యోతివి తెల్లటిబియ్యపుగింజనుఁబొట్టుతోఁ గూడుకొనియుండునపుడు, ఆపొట్టుకంటె దానిని వేఱుగాఁ దెలిసికొనజాలవు. అట్లే బుద్ధిస్థమైన నీస్వరూపమును బుద్ధికంటె వేఱుగాఁదెలిసికొనఁజాలవు కనుకనదియే నీవని బుద్ధితాదాత్మ్యాధ్యాసమును జెంది తద్ధర్మముల నీయందారోపించుకొని నేను కర్తను, నేను భోక్తను, నేను బద్ధుఁడను, నేను సుఖిని, దుఃఖిని, అని నీవు భ్రమచేఁ దలచుచుందువు సూర్యునియొక్క ప్రకాశము మూత్రపురీషాద్య శుచిపదార్థములఁ బ్రకాశింపఁజేయుచుండ తత్తదాకారములుగాఁ గనబడినను, ఆయశుచ్యాది ధర్మములు దానిని యంటునా? అంటవు. అదియెప్పుడును శుద్ధమే అటులనే నీవును బుద్ధినిభాసింపఁజేయుచు సుఖివిగా, దుఃఖివిగా, కామివిగా, మోహివిగాఁ గనఁబడుచుండువాఁడవైనను నాబుద్ధిగతసుఖదుఃఖ కామాది ధర్మములు నిన్నంటవు నీవెప్పుడును శుద్ధుఁడవె కామాదిధర్మములకు నాశ్రయము బుద్ధిగాని, నీవుకావు. ఇందుకుఁ బ్రమాణము శ్రుతి " కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధా ఽశ్రద్ధాధృతి రధృతిర్హీర్ధీర్భీరిత్యేతత్సర్వం మనఏవ" స్వప్నములో నీకు వాసనాత్మక మనస్సుకంటె నితరమైన వేద్యములేమియునుండవు. ఆవేద్యమైన మనస్సును దెలిసికొనుచుండెడివాఁడవు నీవు దానిని దెలిసికొను నీవదెట్లగుదువు నీవెప్పుడును వేదితవేగాని వేద్యమైన బుద్ధివి కావు. దానికిని బ్రకాశమునిచ్చువాఁడవు నీవే నిన్ను దానికంటెవేఱుగా నీవుకనుగొనుటలేదు. ఏమియవిద్యామహిమ నీవు దేహబుద్ధీంద్రియములకంటె నతిరిక్తుఁడవు, అనిలుప్తచైతన్యజ్యోతివి. ఈ శరీరముఁగాని, యీవిషయానుభవము చేసెడి జ్ఞాతయుఁగాని నీస్వరూపమని, తలఁచకుము. నీవు స్వరూపస్థితిచేఁబ్రకాశించెడి శుద్ధచైతన్యరూపుడవు. బుద్ధి యింద్రియముల ద్వారమున విషయముల వ్యాపించి వాని ననుభవించుచున్న, వినుచున్న, చూ

చుచున్న, నిన్నును నీవు వినుచున్న, చూచుచున్న, అనుభవించుచున్న వానినిగా భ్రమఁజెందుదువు. నీకు దర్శనశ్రవణమననాది ధర్మములు స్వాభావికములుకావు. ఈ శబ్దరూపాదివిజ్ఞానమునకు కారణమైనది బుద్ధియే. ఈబుద్ధిసుషుప్తిలో నిర్వ్యాపారముగానుండునుగాన నప్పుడు నీవు స్వకీయ ప్రజ్ఞప్తిరూపమునందే భాసించెదవు. అన్ని కాలములయందు, అన్నియవస్థలయందు నీరూపము వ్యభిచరింపక యేకరూపముగానే ప్రకాశించుచుండును. సుషుప్తిలో రూపాది విశేష విజ్ఞానములేనందున

సుషుప్తౌ చైతన్యస్యాలోపః

నీచైతన్యరూపము నశించునని తలచకుము. స్వప్నజాగరములందు బుద్ధి, యింద్రియములద్వారమునఁవిషయాకారముగాఁ బరిణమించుచుండనీవు రూపాదివిశేషవిజ్ఞానము కలవాఁడవై కనఁబడుచుందువు సుషుప్తిలో బుద్ధి స్వకారణమైన యజ్ఞానమందు లీనమై విషయాకార పరిణామశూన్యమై యుండ నీవుస్వభావ చైతన్యస్వరూపుఁడవై రూపాదివిశేషవిజ్ఞానములేనివాఁడవై యుండెదవు రూపాదివిశేషవిజ్ఞానములేకపోయినమాత్రముచేతనే సుషుప్తిలో నీస్వరూపము బొత్తిగానశించునని పలికితివేని మేలుకొనినతర్వాత నాకేమియుఁదెలియలేదు సుఖముగానిదురఁజెందితినని, యాయవస్థయందలి యనుభవమునీవెట్లు తెలిసికొనగలిగితివి కావున నాయవస్థలోనునునిన్నున్న వానినిగానేనమ్ముముఆయవస్థయందునునీకుసుఖానుభవమును, సర్వవేదనాభావముండునని యీాయనుమాన ప్రమాణముచేఁ దెలిసికొనఁబడుచున్నది నీవే యవస్థలలోను నశించెడివాఁడవుకావు. స్వప్నజాగరములందు బుద్ధియుండునుగనుక యాబుద్ధివృత్తియైన యహంకారవృత్తి తాదాత్మ్యాధ్యాసముచే Identifies with ego దర్శన శ్రవణాది జ్ఞానములఁగలిగి నేనుచూచుచున్నాను అని నీవనుకొనెదవు, సుషుప్తియందాయహంకారవృత్తి వ్యభిచరించును గనుక నేనని నీవనుకొనుట లేదు. ఆనేననియనుకొనుట యన్యోపాధి ధర్మముకాని నీధర్మముకాదు. నీధర్మమేమైన సుషుప్తియందును నయ్యది వ్యభిచరింపక నీయందుఁగనఁబడవలె నటులలేదుగాన నిన్ను నేననియనుకొనెడి పరిచ్ఛిన్నాకృతి

కలవానినిగా భావింపకుము నీవపరిచ్ఛిన్నుడవు దర్శన శ్రవణాది విశేషజ్ఞానము, పరిచ్ఛిన్నాకృతి, నేనని యనుకొనుట, మొదలగు ధర్మములు బుద్ధినిమిత్తముచే నీయందుఁ జూడఁబడుచుండునుగాని వాస్తవముగా నీకవిలేవు కనుకనే శ్రుతియును నీవు బుద్ధిసామ్యము చేతనే ధ్యానించుచున్నవానివిగా చలించుచున్నవానివిగా నుండుచుందువని చెప్పుచున్నది. శ్రుతి॥ ధ్యాయతీవలేలాయతీవఇత్యాది॥ సుషుప్తిలో నీకు విశేషవిజ్ఞానము లేకపోవుటకుఁగాను గొన్ని హేతువులఁ జెప్పెదవినుము. మధురామ్లకటుతిక్తాదులయిన యనేక ప్రకారవృక్షరసముల వేఱువేఱుగా నున్నపుడు వానిని మనము వివిక్తముగా నియ్యది యామ్లరసము ఇయ్యది తిక్తరసము, ఇయ్యది మధురరసము అని వివేకముగాఁ దెలిసికొనగలుగుదుము. ఆరసముల భృంగముగొనితెచ్చి మధువుయందుంచినప్పుడు మనమువానిని వివిక్తముగా నిదియామ్లరసము ఇయ్యది కటుకము అని విశేషించి తెలిసికొనఁజాలము వాని విషయమై విశేష విజ్ఞానము లేకపోయినను సామాన్యజ్ఞానము మనకుఁగలిగియే యుండును. మఱియు నదులు వేఱువేఱుగా భూమిమీదఁ బ్రవహించునపుడు ఇయ్యది గంగ, ఇయ్యది నర్మద, ఇయ్యది కృష్ణ, అనివానినిమనము విభాగముగాఁ దెలిసికొన గలుగుదుము ఇవి యన్నియు సముద్రమునందేకీభావముఁజెందియుండ నియ్యదిగంగ, ఇయ్యది నర్మద అని వివేకముగా విశేషవిజ్ఞానము లేనివారమై యగుదుము. అప్పుడు వానివిషయమై మనకేమియుఁ దెలియఁజాలదు. అట్లే సుషుప్తియందు సర్వము స్వకారణబీజమందు(Nothingness తమోరూపస్థితి) లీనమయి యేకీభావము జెందియుండునపుడు దానిని విశేషముగా నీవు తెలిసికొననివాఁడవై సామాన్యముగాఁ దెలిసికొనుచుండెడివాఁడవై యుండెదవు నీయొక్కదృష్టిగాని తెలివిగాని యగ్నియొక్క యౌష్ణ్యమువలె నేవేళయందును నేయవస్థయందును లోపించదు. అయ్యవినీకు స్వాభావికముఃఖకనుక సుషుప్తిలోను నిన్ను వదలక నేయుండును. అన్నియవస్థలలోనును నీతెలివి నశించదని నిశ్చయింపుము. శ్రుతియును నీవవిలుప్తచైతన్య జ్యోతివని చెప్పుచున్నది ఇందుకుఁ బ్ర

మాణము శ్రుతి॥ యద్వైతన్న పశ్యతి పశ్యన్వైతన్న పశ్యతి న హి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్ న తు తద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్॥ యద్వైతన్నజిఘ్రతి జిఘ్రన్వై తన్నజిఘ్రతి న హి ఘ్రాతుర్ఘ్రాతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్ న తు తద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యజ్జిఘ్రేత్ యద్వైతన్నరసయతే రసయన్వై తన్నరసయతే నహిరసయితుః రసయతేర్విపరిలోపో విద్యతే అవినాశిత్వాత్ న తు త ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్రసయేత్ యద్వైతన్నవదతి వదన్వై తన్నవదతి నహి వక్తుర్వక్తేర్విపరిలోపో విద్యతే అవినాశిత్వాత్ న తు తద్వితీయమస్తి తతోఽన్యద్విభక్త యద్వదేత్ యద్వైతన్న శృణోతి శృణ్వన్వైతన్న శృణోతి న హి శ్రోతుశ్శ్రుతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వా న్నతుతద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యచ్ఛృణుయాత్ యద్వైతన్నమనుతే మన్వానోవై తన్నమనుతే నహి మంతుర్మతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్ నతు తద్విదీయమస్తి తతోఽన్యద్విభక్తం యన్మన్వీత యద్వైతన్నస్పృశతి స్పృశన్వైతన్నస్పృశతి నహిస్ప్రష్టుః స్పృష్టేః విపరిలోపోవిద్యతేఽవినాశిత్వాన్నతు తద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్స్పృశేత్ యద్వైతన్నవిజానాతి విజానన్వైతన్నవిజానాతి న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్నతుతద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్విజానీయాత్ యత్ర వా అన్యదివస్యాత్ తత్రాఽన్యోఽన్యత్పశ్యేత్ ఇత్యాది॥జాగ్రదాదిద్రష్టలయొక్క దృష్టిలోపించిననుఁజైతన్యజ్యోతియొక్క దృష్టి యేయవస్థయందును లోపింపనేరదు. ఎటులనిన జాగ్రద్దృష్టియంధుడైనను స్వప్నములోఁ బదార్థములఁ జూచుచునే యుండును. జాగ్రద్దృష్టియొక్క దృష్టిలోపించినను స్వప్నమందుఁగూడాత్మదృష్టిచే జూచునుగాన నాత్మదృష్టియెప్పుడును లోపింపదనియనుమేఖుంపుము సూక్ష్మబుద్ధిచే నీరూపమును శోధించుకొంటివేని సుషుప్తియందును నీతెలివి యబాధితమై భాసించుచుండునని నీవు తెలిసికొనగల్గెదవు ఈవిషయమై యొకయుదాహరణము చెప్పెదవినుము. ఒకమ

నుజుని నిన్నటిరాత్రి నిశీథపువేళ నీవెచ్చటనుంటివని ప్రశ్న చేయుదము పెద్దవీథిలోనుంటినని వాఁడు బదులుచెప్పును. అచ్చటప్పుడెవరుండిరి నీకేమి తెలియునని తిరిగి మనమడుగుదము అచ్చటెవరును లేరు నాకేమి యుఁదెలియదనివాఁడు మరలపలుకును ఎవరును లేరని వాఁడు పలికిన మాటవలన వానికంటె నితరులచ్చోటలేరని నీవు తెలిసికొనెదవా లేక వాఁడును లేడని నీవు తెలిసికొనెదవా వాఁడును లేడని తెలిసికొంటివేని యాస్థితి యనుభవమును నెఱుఁగనివాఁడు యెవరును లేరని యాస్థితి యనుభవమును గూర్చివాఁడెట్లుపలుకగలిగెడిని ఆనిశీథపువేళ యితరులెవరు నచ్చోట లేకపోయినందున ఎవరు లేక పోవుటను (సర్వవేదనాభావము) వాఁడు తెలిసికొన్నవాఁడై ఎవరును లేరని వాఁడుపలికెను గాని యాస్థితి యనభవముగననిచో వాఁడు దానిఁగూర్చి పలుకుటయే సంభవింపదు. కావున నితరు లచ్చట లేకపోయినను వానిని మాత్ర మచ్చటనున్నవానినిగానే నీవు తెలిసికొనవలెను. అట్లే సుషుప్తినుండి మేల్కాంచిన మనుజుఁడు నాకేమియుఁదెలియ లేదు (నకించిదవేదిషం) అని పలుకును రూపాదివిషయములు ఆసుషుప్తియందు కారణస్వరూపముగా నుండి దుర్జ్ఞేయములైనందున వాని విషయమయి విశేష విజ్ఞాన మనుభవింపకపోవుటచేత నాకేమియుఁ దెలియలేదని మేలుకొనినతోడనే స్మరించగలిగె వాఁడాస్థితియందు దానిననుభవింపనివాఁడయిన స్మరింపఁజాలఁడు ఏమియుఁదెలియకబోవుటఁ దెలిసికొనెడివాఁడు అప్పుడునుండెడివాడేయని నీవు తెలిసికొనవలె ఏమియుఁ దెలియలేదను జ్ఞానము సుప్తోత్థితున కంతకుముందనుభవము లేనిదై యాకస్మికముగా నప్పుడేకలుగునని చెప్ప సాధ్యమగునా? అజ్ఞానము వానికి స్మృతిరూపముగాని కేవల మనుభవరూపము కానేరదు. స్మృతియెప్పుడును ననుభవజన్యమయి యుండవలె. కావున సుషుప్తియందు వానికి సర్వవేదనాభావరూప యనుభవము కలదని రూఢిగా తెలిసికొనుము సుషుప్తిలో నీస్వరూపముండునని యీహేతువులచే నిశ్చయముగా నమ్ముము నీవు స్వయంప్రకాశుడవు స్వప్నమం దితరజ్యోతి యపేక్ష లేకయే నీవుస్వయముగానే సర్వవిషయములఁ దెలిసికొనుచుందవు

### స్వాప్నికపదార్థః ఆభాసమాత్రం

అవస్థాత్రయమందును నీరూపము స్వయంప్రకాశమే స్వప్నమందును జాగ్రత్తునందువలె గ్రహించువాఁడు గ్రహింపఁబడునది (గ్రాహ్యగ్రాహకభావః) మొదలగు సర్వవ్యవహారము కనఁబడుచుండును. అచ్చటను చక్షురాదీంద్రియములుకలవు వానిని బ్రకాశముచే నుపకరించు సూర్యాది తేజస్సులుకలవు సంఘాతపురుషుఁడు ఇతరజ్యోతిస్సులచేతనే విషయములఁ దెలిసికొనుచున్నానని తలచునుగాని తాను చైతన్యముచేతఁ బ్రకాశింపఁ జేయబడినవాఁడై వానిని దెలిసికొనుచున్నానని యనుకొనునట్లు గనఁబడుట లేదుగనుక యాత్మస్వయంప్రకాశము స్వప్నమందును కానేరదని పలికితివేని జాగ్రత్తునందు బాహ్యమున శబ్దస్పర్శరూపాది విషయములుగలవు వానినిఁ బ్రకాశింపఁజేసెడి యింద్రియములు కలవు. ఇతర జ్యోతిస్సులుగలవు ఇవన్నియు స్వప్నమందుఁ గనఁబడినను అయ్యవి భ్రమరూపములుగాని వాస్తవములు కావు. ఎందుకనిన, నీవు జాగరావస్థయందు నేత్రోన్మీలనముచేసి నేత్రేంద్రియ ద్వారమున నొక విషయము చూతుము. పిదప నేత్రనిమీలనముచేసి స్మరించిన దానినే నీవు నీశరీరములోఁ జూతువు అయ్యది నిజమైనపదార్థమా కానేరదు. అయ్యదిసత్యమైనచో నల్పమైన శరీరమునందా మహత్పదార్థమెట్లిమడగల్గెడిని? ఇమడఁజాలదు కావున నయ్యది మనోవాసనారూపమని నీ వెంచుము బహిఃప్రజ్ఞుఁడై నేత్రోన్మీలనమందు జూచువాఁడును అంతఃప్రజ్ఞుఁడై నేత్రనిమీలనమున లోపలఁజూచువాఁడును ఒకడే ఇద్దరును శరీరమునందుండియే చూచుచుందురు నేత్రోన్మీలనమున నేవిషయమును జ్ఞాత, చూడనియెడల నేత్రనిమీలనమున దేనినిగనుగొనఁజాలఁడు అట్లేస్వప్నమందును బాహ్యమున నింద్రియద్వారమునఁజూడఁ బడనియేపదార్థమును స్వప్నమందుఁ గనఁబడుట సంభవించదు ఒకవేళస్వప్నమందు జాగరమునఁ జూడఁబడని క్రొత్తపదార్థములు గనఁబడిన నవియును జన్మాంతరములందుఁ జూడఁబడినవిగానే తలంచవలె మనస్సు బహిరింద్రియతంత్రము అదియింద్రియద్వారమున విషయమును దెలిసికొనఁగల్గునుగాని యింద్రియనిర

పేత్తుపై విషయమును దెలిసికొనఁజాలదు చక్షురింద్రియ ద్వారమునబంధుపుత్రమిత్ర దేశనదీవన సూర్యచంద్రాదులు మొదలగు రూపములవ్యాపించి వానినిఁ దెలిసికొనుచుండును. ఇట్లే శ్రోత్రేంద్రియద్వారమున శబ్దముల, రసనేంద్రియ ద్వారమున రసముల, ఘ్రాణేంద్రియద్వారమున గంధముల, త్వగింద్రియద్వారమున స్పర్శల, గ్రహించుచుండును ఏయే విషయములతో మనస్సుకలిసికొనునో యాయావిషయములచే నదియభిరంజితమగును (అనగా గుఱుతుగలదై చేయఁబడును) ఈగుఱుతు నే వాసనయనియు సంస్కారమనియు తత్వజ్ఞులు చెప్పుదురు రేయింబగలు నీవింద్రియ ద్వారమున ననుభవించు శబ్దరూపాది విషయముల గుఱుతులు నీమనస్సులో నాటుకొనియేయుండును నీవుమనస్సులో నేదిసంకల్పించిన నాసంకల్పాత్మక వృత్తియును వాసనారూపముగా నీమనస్సులో నాటుకొనియేయుండును. కావున స్వప్నదర్శి యీదేహమందుఁ జూచుమహత్పదార్థములన్నియు మనోవాసనారూపములుకాని వాస్తవములని తలంచకుము అల్పప్రదేశముగలశరీరములో నిజముగామహత్తులైన పర్వతహస్త్యాదులుండఁజాలవు కావనయ్యవిమిథ్యారూపములనియు నీవుకనవలె జ్ఞాత యీదేహమందుండియేజాగరస్వప్నముల రెంటినిఁ జూచునుఁగాని దేహముకంటె బహిఃప్రదేశమున వాస్తవమైన పదార్థములఁ జూడడు నిజముగాదేహముకంటె బహిస్సున దేశాంతరమునందు వాస్తవపదార్థములనుఁ జూచుననియంటివేని నీవుస్వప్నముఁగనునపుడు నీజనకుఁడు, జనని, పుత్రులు, మేలుకొనియేయుందురు. వారునీతోఁ బలుకుటలేదు నీవువారితోస్వప్నమున మాట్లాడుచుందువు స్వప్నములోనీవు పుత్రునినొక ప్రశ్న నడుగుదువు అందుకువాఁడు జవాబుచెప్పును ఈవృత్తాంతమును నీవుస్వప్నమునఁగనెదవు. నిజమైనపుత్రుని నీ వడుగుటలేదు వీఁడు జవాబు చెప్పుటయులేదు. స్వప్నములోనీకుఁ గనఁబడి జవాబునిచ్చు పుత్రుఁడు వేఱొండాకారముగల వాఁడుగాఁగనఁబడఁడుఇట్లుండస్వప్నములోనీకుఁ గనఁబడినపుత్రుఁడు ప్రశ్నసమాధాన రూపవ్యాపారము సత్యమని నీవెట్లు చెప్పగలవు వాఁడింకొక పుత్రుఁడనెదవేని మేల్కాంచినతోడనే వాఁడేలఁ గనఁబడకపోవలెకనుక, ఆస్వాప్నిక పుత్రుఁడు నీవుప్రశ్న

నడుగుటయు వాఁడుసమాధానము చెప్పుటయు మొదలగు వ్యవహారమం తయు మనోవాసనాభ్రమరూపమనియే విశ్వసించుము. నీమనస్సు జాగర మున విషయవాసనలచే నభిరంజితమై స్వప్నమందు దృశ్యపదార్థ రూప ముగా నాభాసించుచుండునని శ్రుతియును జెప్పుచున్నది. శ్రుతి "అస్య లోకస్య సర్వావతో మాత్రామపాదాయేతి" "తదేతత్సర్వం మనస్యేకీభ భవతీతి" అత్రైషస్స్వప్నే మహిమానమనుభవతి యద్దృష్టం దృష్టమను పశ్యతిశ్రుతం శ్రుతమేవార్థమనుశృణోతి దేశదిగంతరైశ్చ ప్రత్యనుభూ తంపునఃపునః ప్రత్యనుభవతి దృష్టం చాదృష్టంచశ్రుతం చాశ్రుతంచ అనుభూతంచా ననుభూతం చసచ్చాసచ్చ సర్వంపశ్యతి సర్వః పశ్యతి" మనస్సు సూర్యునివంటిది ఇంద్రియములు రశ్మలవంటివి సూర్యుడస్తమించుచున్న త్రద్రశ్మలునున తనియందేకీభవించి యుండును అతఁడుదిరిగి యుదయించుచున్న నవియును వేఱుగా లోకమందు వ్యాపించును సూర్యునితోఁగూడ రశ్మలుండుచుండును గాని నతనినివదలిస్వతంత్రముగా నుండజాలవు. అట్లేమనస్సు స్వా పమునుజెందుచున్న నింద్రియములును స్వస్థానముల వదలిమనస్సునందే కీభవించియుండును తిరిగిజాగరమునుజెందుచున్న నవియును వేఱుగాస్వ స్థానములఁజేరి విషయములందువ్యాపించును ఇంద్రియములెప్పుడును మ నోధీనములై యుండునుగాని మనస్సును వదలిస్వతంత్రముగా నుండఁజా లవు దీనినే శ్రుతియును జెప్పుచున్నది "యథా గార్గ్య మరీచయో అర్క స్యాస్తంగచ్ఛతః సర్వాఏవఏతస్మిం స్తేతేజోమణ్డలఏకీభవన్తితాఃపునఃపునరు దయతః ప్రచరంత్యేవంహవై తత్సర్వం పరేదేవేమనస్యేకీభవతి" కనుక స్వప్నమున స్వప్నదర్శికి నొకమనస్సే వేద్యమై యుండును ఆ మనోవాస నారూపమైనవృత్తులేకర్మనిమిత్తముచేనభివ్యక్తములై బాహ్యమునశరీరవి షయేంద్రియాకారములుగాబంధుమిత్రపుత్రదేశాంతరనదీరూపములుగా నాభాసించునుఅప్పుడుస్వప్నదర్శికేవల మావాసనారూపములైనపదార్థ ములనేభ్రమచేఁజూచుచుండునుగాని స్వప్నమునఁజూడఁబడెడియాదిత్యా దిజ్యోతిస్సులు, శరీరము, ఇంద్రియములు, మొదలగుపదార్థములన్నియు నాభాసలేవాస్తవములుకావు. కావునన వ్వేళ సంఘాతపురుషుఁడితరజ్యో

తిస్సులచేఁ దానువిషయములఁ దెలిసికొనుచున్నానని తలచడు అతఁడి తరజ్యోతులు లేనియాస్వప్నమునఁదనస్వయంప్రకాశరూపమును వివిక్త ముగాఁ దెలిసికొనఁగలడుజాగరమునందైతే యాచైతన్యజ్యోతిజ్యోత్యం తరములతో వ్యాపించియుండునుగావున తుషతోఁగలిసి యుండెడి తండు లమువలె సులభముగాఁ దెలిసికొనఁబడక దుర్వివేకమైయుండును గావు ననే స్వప్నమందుఁ జైతన్యజ్యోతికి సర్వావభాసకత్వరూపమును, అన న్యావభాస్యత్వరూపమును, అయిన చిత్త్వము నిరాటంకముగా సిద్ధిం చునని దెలిసికొనుము ఏవిషయములులేని సుషుప్తి దశయందయ్యాది తెలి సికొన సాధ్యముకాదు స్వప్నమందు దృశ్యమైన మనోవృత్తివిలక్షణ ముగా నాత్మస్వరూపము సువివేకమైభాసించెడిని కానస్వప్నమందేయా త్మకు స్వయంజ్యోతిష్ట్వముచూపించఁబడియె ఇందుకుఁ బ్రమాణవచనము "అతఏవశ్రుతౌ స్వప్నే దృశ్య వృత్తివివేకతః స్వయంజ్యోతి స్స్వరూపే ణాతస్యాః ద్రష్టా ప్రదర్శితః"

అవస్థా త్రయేఽప్యాత్మా, అసంగః, కామకర్మాభ్యాంవివిక్తః.

నీవుప్రకాశమువలె శుద్ధుఁడవు ప్రకాశమశుచి పదార్థములలో నుండెడిదైనను వాటిధర్మములు దానినియంటునా అంటవు పద్మపత్ర ము జలమందుండెడిదైనను ఆజలమునుదానినియంటదు అట్లేనీవును ను పాధులలోనుండెడి వాఁడవైనను వాటిధర్మములు నిన్నంటవు. ఎందుకని న, మూర్తము మూర్తాంతరముతో సంబంధముగలదగును నీవమూర్తు డవు కావున మూర్తములైన దేహేంద్రియాద్యుపాధులతో నీకుసంబం ధములేదు. కనుక వానిధర్మములచే నీవులేపనముచేయఁబడవు. లేపన మనగా నితరములతో సంబంధముకలుగుచుండ, తద్రూపములచేతఁ బూయఁబడుట మనస్సు మూర్తద్రవ్యము కానయ్యాది మూర్తములై న విషయములతో సంబంధముకలదగుటవలన వానిచే నభిరంజింపఁజే యఁబడుచుండును. వస్త్రముమృగమదముతోసంబంధముకలదగును. దా నిచేనదివాసనగలదై చేయఁబడును. ఇట్లే మూర్తములుబండొఁటులు సం బంధముగలవై తత్తద్ధర్మములచే లేపనము చేయఁబడినవగుచుండును. లేపన ముకు హేతువు సంబంధమే అదియే సంగమని చెప్పఁబడును నీవమూ

స్తుడవై నందున దేహేంద్రియాద్యుపాధుల సంబంధము నీకుఁ గల్గదు కనుక వాని ధర్మములచే నీవభిరంజితుడవుకావు గాన బ్రహ్మవేత్తలు నునిన్ను గగనమువలె పద్మపత్రమువలె నిర్లేపునిగా నసంగునిగా నిరంజనునిగాఁ జెప్పుచుందురు. పద్మపత్రము జలమునువలె నీవు దేనినంటవు. నీవు శరీరములోనుండెడివాఁడవైనను, అశరీరుడవే బుద్ధిసంబంధముచే పరిచ్ఛన్నుడవుగాఁ గనఁబడినను అపరిచ్ఛిన్నుడవే ఇందుకుఁ బ్రమాణము "శరీర్యప్యశరీర్యేషః పరిచ్ఛిన్నోఽపి సర్వగః" సూర్యప్రకాశము సమస్తప్రాణి నేత్రములవ్యాపించి ప్రకాశింపఁజేయుచున్నను వానిదోషములచే స్పృశింపఁబడదు. అటుల నీవును బుద్ధ్యాదులలో వ్యాపించి వానినిఁ బ్రకాశింపఁజేయుచున్నను వాని ధర్మములచేతనీవు స్పృశింపఁబడవు. శ్రుతి "సూర్యోయథాసర్వలోకస్య చక్షుర్నలిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః ఏకస్తథాసర్వభూతాంతరాత్మా నలిప్యతేలోకదుఃఖేన బాహ్యః" ఇతి నీవు క్రియలఁ జేసెడివాఁడవుకావు హస్తపాదాదులచేఁ గ్రియను జేయుచుండెడిది యీశరీరము నీవుకావు నీవుభ్రమచేఁ జేయుచున్నానని దలచుదువు. నీవుచేయుటలేదు. ఎయ్యదికర్మను జేయునో యదియే దాని ఫలములచేఁ గట్టఁబడును. నీవు కర్మను జేసెడివాఁడవుకావు కనుక తత్ఫలములచేతను బంధింపఁబడవు. నీవుస్వభావముగా నుపాధిగలవాఁడవు కావు. స్వభావముగా శరీరముగలవాఁడవైతివేని స్వప్నమందును దానిని వదలఁజాలవు. స్వప్నమున నీవుశరీరమునువదలి యన్యమయిన వాసనామయ శరీరముతో దేశాంతరగమనాది వ్యవహారముల సలిపెదవు. స్వభావముగా నీవునిరుపాధికుడవు క్రియలు నీధర్మములు కావు. శరీరధర్మములు నిజముగాఁ గ్రియలునీధర్మములయిన స్వప్నమందును నీవు వానినిజేయుచు వానిఫలములచే బద్ధుఁడవు కావలెనటుల లేదు స్వప్నమునఁ గర్మను జేయుచుండెడివానివలెను తత్ఫలములయిన మోదప్రతాపాదుల ననుభవించువానివలెను గనఁబడుచుందువు అయ్యది యాభాసమాత్రమె. శ్రుతి॥ ఉతేవస్త్రీభిస్సహమోదమానః॥ హస్తపాదాదులు గలశరీరమేనీకు నిజముగాస్వప్నమందు లేదు. అటులుండఁ గ్రియనెట్లుఁ జేయగల్గెదవు. భ్రమచే మోదప్రతాపాదులఁబొందుచున్నావని తలచెదవు

నీవు నిజముగాఁ వానిని బొందుటలేదు. రాజువలె సాక్షిగాఁజూచుచుందువు. శ్రుతి॥ దృష్ట్వైవ పుణ్యం పాపంచ॥ దర్శనమాత్రమువలన వానిచే బంధింపఁబడవు కావున స్వప్నమున నీవు క్రియలఁజేయుట లేదు తత్ఫలములచే బద్ధుఁడవగుటయు లేదు. అందుచేఁ గర్మ నీకు స్వాభావికధర్మముగాదని స్పష్టమయినది స్వప్నమున నీకు దేనితోను సంబంధములేక పోవుటచే నీవసంగుడవని తెలిసికొనుము స్వప్నమున నీవునిజముగాఁ గర్మచేయుచుఁ దత్ఫలముచే బంధింపఁబడెడివాఁడవైన మేల్కాంచినపిదపయును నీవు బాధింపబడినవాఁడవయి యేకనఁబడవలె స్వప్నమందు నీవొక చౌర్యకర్మనుజేసెదవు రాజభటులచే కారాగృహములో నుంచఁబడి దుఃఖమనుభవించెదవు. అయ్యదినిజమనియెదవేని మేలుకొనిన పిదపయును నాదుఃఖమునునీవనుభవించుచుఁ గనఁబడవలెఅటులలేదు కనుక అచ్చటనీవుచేయుఁగర్మయు నాభాసయేతత్ఫలములయిన దుఃఖానుభవములు ఆభాసమాత్రములేయని నమ్ముము స్వప్నమునఁ గామముచే మిత్రాదిజనులు చూచుచుండ నీవొక నింద్యకర్మను జేసెదవు అయ్యది నిజమంటివేని మేలుకొనిన పిమ్మట నిన్నానింద్య కర్మఁజేయుటవలన వారుదూషింపవలె. ఆకామసంగము గలవాడవయి యేకనఁబడవలె అటులలేదు. కావున కామక్రియాదులునీధర్మములుకావు. నీవు నిష్క్రియుఁడవు కామాది ధర్మరహితుఁడవు, అకర్తవు అసంగుఁడవు అని దెలిసికొనుము. శ్రుతి॥ నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనమితి॥ లోకములో మూర్తపదార్థములు మూర్తాంతరములతో సంబంధముగలవగునపుడు క్రియోపలబ్ధి జూడఁబడుచుండును నీవమూర్తుడవు ఏమూర్తద్రవ్యములతో నీకు సంబంధము సంభవించకపోవుటచే క్రియోపలబ్ధియు సంభవింపదు. మూర్తములయిన దేహేంద్రియాది సంఘముతో సంబంధములేనందున నీవు క్రియోపలబ్ధికి కారణుడవుకావు శ్రుతియును స్వప్నమందు నీవసంగుడవని చెప్పుచున్నది. "అసంగోహ్యాయంపురుషః" స్వప్నమందలి క్రియయుతత్ఫలములయినదుఃఖాద్యనుభవము ఆభాసమాత్రమయినందున ఆత్మ వానితోసంబంధములేనివాఁడైననుకామసంబంధముగలవాఁడుగాఁజూడఁబడుటవలన

ససంగుడేయని పలికితి వేని మేలుకొనిన పిదపయునావిషయవిశేషమందలి కామముగలవాడయియే కనఁబడుచుండవలె. అటులలేదు కావున కామముకూడ, ఆభాసయేయని తెలిసికొనుము స్వప్నమున కామ కర్మాదులాభాసలయినందున నాత్మ యసంగుడయినను జాగరమున నేను గర్తను, నేనుకామిని అని తలచుచు కామముచేఁ గ్రియను జేయుచుఁ గన్పడుచుండును. కనుక జాగరమున నాత్మ సక్రియుఁడు సకాముఁడు ససంగుఁడు అని పలికితి వేని జాగరమునందును గ్రియను జేయునది యీశరీర మే కాని యాత్మకానేరదు. కరచరణాది మత్తైనశరీరము చేయుచున్న ఆత్మయును జేయుచున్నదివలెఁ గనఁబడుచుండును బుద్ధి కామముగల దైన యాత్మయు నటులనే కనఁబడుచుండును బుద్ధి సుఖదుఃఖఫలముల చే బంధింపఁబడుచున్న ఆత్మయు నటులనే కనఁబడుచుండును. కావున జాగరమునను ఆత్మయసంగుడే నిష్క్రియుడే అకాముడే శ్రుతి॥ ధ్యాయతీవలేలాయతీవ॥ మఱియు జాగరమున కామకర్మలాత్మకు స్వాభావిక ధర్మములయిన సుషుప్తియందును నవివ్యభిచరింపఁజాలవు. సుషుప్తియందాత్మ కామరహితుడై కర్మరహితుడై యసంగుఁడై కేవలము ప్రజ్ఞప్తిమాత్రము స్వరూపముకలవాఁడై కనఁబడుచుండును. కావున కామకర్మాదిధర్మము లన్యోపాధిధర్మములు స్ఫటికమందు లొహిత్యాదులువలె జాగరమున నాత్మయందుఁ జూడబడెడివైనను అవిస్వభావముగా నాత్మధర్మములు కావని నీవెంచుము. నీవెప్పుడును నిర్ధర్ముడవే నిష్క్రియుడవె శరీరములోనుండెడివాఁడవయినను వానిధర్మములచే నభిరంజితుఁడవుకావు. ఇందుకుఁ బ్రమాణము గీత॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయమవ్యయః। శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥ స్వప్నమునుండి జాగరమునుఁబొంది స్వప్నధర్మములచే విడువఁబడి శుద్ధుఁడవై కనఁబడుచుందువు జాగరమునుండి సుషుప్తిం జెంది జాగరధర్మములచే విడువఁబడి శుద్ధుఁడవై కనఁబడుచుందువు. కాబట్టినీవు మూడుస్థానములందును నసంగుడవే శుద్ధుడవే యేధర్మము నిన్నంటదు నీవునిత్యశుద్ధుఁడవు స్థానత్రయధర్మవిలక్షణుఁడవు అమృతుఁడవు నీవు క్రమముగా జాగరమునుండి స్వప్నముఁ జెందెదవు. స్వప్నమునుండి

సుషుప్తిఁజెందెదవు. తిరిగి క్రమవ్యత్యాసములచే స్వప్నమున్నైన లేక జాగరమునయిన పొందెదవు ఇటుల మూడవస్థలలో మెలగుచు న్నందున నీవు వీనికంటె నతిరిక్తుఁడవని గ్రహింపుము సుషుప్తియందు కామకర్మాది ధర్మములు లేన్నిదెభాసించెడిదియే నీస్వభావరూపము. ఒకయవస్థయందు నీయందుఁగనఁబడెడి ధర్మములు వేఱొకయవస్థయం దు వ్యభిచరించుచుండును. కావున ఆధర్మములు నీకు స్వాభావికములు కాఁజాలవు అవి నీకాగంతుకములు గనుకనేయవి సుషుప్తియం దు వ్యభిచరించుచుండును అగ్నికి నౌష్ణ్యమువలె స్వాభావికధర్మ ములైన సుషుప్తిలోను నవి నిన్నంటుకొనియే యుండవలె అటు లలేదు కావున, ఆకామాది ధర్మము లన్యోపాధి ధర్మములు కాని నీవికావని తెలిసది నీవు స్వభావముగా శుద్ధస్ఫటికమును బో లియుండెదవు. నీవు స్థానత్రయధర్మములకంటె నతిరిక్తుఁడవు వాని తో నీకు సంబంధములేనందున నసంగుడవు. నదియందు ప్రవాహముచే నకంప్యమైన నొకమహామత్స్యము ఈవలిదరినుండి యావలిదరికి నావ లిదరినుండి యీవలిదరికి సంచరించెడిరీతిని నీవును నీమూడవస్థలందు, ఒక యవస్థనుండి మఱియొకయవస్థనుగూర్చి జరించుచుండెదవు ఆమత్స్యము ఉభయకూలములందుఁ గ్రమముగా సంచరించుచుండును అయ్యది యా కూలములకంటె నతిరిక్తమై చూడఁబడుచుండును ఉభయకూలగతధర్మ ములైన నాచుపాచి కాలుష్యాదులచేనది పూయఁబడుటలేదు అట్లేస్వ ప్నజాగరాదులందు జరించుచుండెడి నిన్నువానికంటె నతిరిక్తునిగాను వానిధర్మములచేఁ బూయబడక యసంగునిగాను భావింపుము శ్రుతి "తద్యథా మహామత్స్యః ఉభేకూలే అనుసంచరతి పూర్వం చాపరం చై వమేవాయం పురుషఃఏతావనుసంచరతి స్వప్నాంతంచ బుద్ధాంతం చేతి" నీవునిజముగా నొకయవస్థనుండి మఱియొకయవస్థనుగూర్చి సంచరించు టయునులేదు నీవుగిరికూటమువలె స్థిరుడవు కాబట్టి యాత్మవేత్తలుని న్ను కూటస్థునిగాఁ జెప్పుదురు (కూటఇవతిష్ఠతీతి కూటస్థః) ఆ జరించున దియు బుద్ధియేగాని నీవుకావు ఆబుద్ధినిమిత్తముచే నీవు చరించుచుండు వానివలెఁ జూఁబడుచుందువు. ఆబుద్ధికిస్వప్నజాగరసుషుప్తులను మూడ

వస్థలుకలవు. ఈమూడవస్థలలో నడిచరించుచుండెడిని. దానిసంబంధమ
చే నీమూడవస్థలు నీయందుఁజూడఁబడుచుండునుగాని, యథార్థముగ
నీకవిలేవు నీవుమూడవస్థలకంటె విలక్షణుడవు బుద్ధిసంబంధమును (అ
గా బుద్ధియందాత్మభావము) నీకుస్వస్వరూపజ్ఞానము లేకపోవుటన
నగల్గినది నీవుబుద్ధివిగావు బుద్ధినిప్రకాశింపఁజేసెడి జ్ఞానమేనీస్వరూపమ
ఈమూడవస్థలలో జ్ఞాతృత్వజ్ఞేయములు వ్యభిచరించుచున్నను జ్ఞానస్వ
రూపము మాత్రము వ్యభిచరింపక స్వయంప్రకాశముగా భాసించు
చుండును ఆజ్ఞానస్వరూపమే నీనిజరూపమని భావింపుము.

విశ్వతైజసప్రాజ్ఞేభ్యో విలక్షణం తురీయం.

జాగరమున నీవింద్రియములద్వారమున బహిర్విషయములందుఁ
బ్రజ్ఞకలవాఁడవై రూపాదులఁజూచుచు, వినుచు, నేను అని అనుకొం
డినిన్ను ఈస్థూలమునుగాను, పరిచ్ఛిన్నాకృతికలజ్ఞాతనుగాను నెన్నుచుం
దువు ఈజాగరముఁదెలిసికొనెడి నిన్నువిశ్వునిగా వేదాంతులు వచింతు
దరు స్వప్నమున బాహ్యేంద్రియములుపరమించినను అంతస్స్థమైన మ
నస్సుయొక్క వాసనామయవిషయములందుఁ బ్రజ్ఞకలవాఁడవై నేను
చూచుచున్నాను, వినుచున్నాను, అనితలంచుచు వాసనాత్మకసూక్ష్మ
విషయముల భ్రమచేననుభవించుచుండెదవు. ఈస్వప్నమును దెలిసికొ
నెడినిన్ను తైజసునిగా వేదాంతులు చెప్పుదురు (తేజసిభవతీతి తైజసః
తేజశ్శబ్దేనమనో వాసనామయ ప్రజ్ఞావివక్షితా తాదృశప్రకాశరూప
ప్రజ్ఞాయాం భవతీతితైజసఇతిసంజ్ఞా) సుషుప్తియందు నీవు ప్రజ్ఞాన
ఘనుఁడవును రూపాదివిశేష విజ్ఞానములేనివాఁడవును మంచుచే సూ
ర్యుఁడువలె తమోరూపమైన మాయచే నావరింపఁబడినవాఁడవును దా
నితో నభేదముఁజెంది (Identifies with nothingness) స్వరూపమును
మఱచి నిద్రాసుఖమనుభవించుచుందువు ఈసుషుప్తిని దెలిసికొనెడి ని
న్ను ప్రాజ్ఞునిగ తత్త్వజ్ఞులు వచింతురు. (ప్రకర్షేణాజ్ఞః ప్రాజ్ఞః ప్రజ్ఞప్తి
మాత్రస్వరూప మస్యైవేతి ప్రాజ్ఞోవా) ఈస్వప్నజాగరసుషుప్తులఁ దె
లిసికొనెడి జ్ఞాతలునీవుకావు. వారికి విలక్షణముగ భాసించెడి తెలివిసీలో
నొకటియున్నది. అయ్యది యీముగ్గురికంటె విలక్షణము, స్వయంప్రకా

శము దృశ్యసంబంధము లేనిదై యొప్పారునది. అదియే యన్నియవస్థలయం దన్నికాలములందు సత్యము. అదియే బ్రహ్మము. అదియేనీవు. దీనినే బ్రహ్మవేత్తలు తురీయమనియు, జతుర్థమనియు, వ్యవహరింతురు. దానియందే యీవిశ్వతైజసప్రాజ్ఞులు సముద్రమునం దలలవలె బుట్టుచుందురు. నశించుచుందురు. కనుక అవి సత్యములుకావు. కాలత్రయమందుండునదియే సత్యమని చెప్పఁబడును బహిః ప్రజ్ఞుడై జాగరముననుభవించెడి విశ్వుఁడవునీవుకావు అంతః ప్రజ్ఞుడై స్వప్నముననుభవించెడి తైజసుడవు నీవుకావు. ప్రజ్ఞానఘనుడై సుషుప్తిని యనుభవించెడి ప్రాజ్ఞుఁడవు నీవుకావు. జ్ఞానమాత్రమైన తురీయమే నీవు ఇందుకుఁ బ్రమాణము "నాంతఃప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనంన ప్రజ్ఞం నాప్రజ్ఞం...అద్వైతం చతుర్థం మన్యంతే సఆత్మాస విజ్ఞేయః॥ తత్త్వమసి శ్వేతకేతో" బహిఃప్రజ్ఞాదిధర్మములుగలవిశ్వతైజసప్రాజ్ఞులురజ్జువునందు సర్పమువలెఁదోచెడిమాత్రమే స్వరూపముగలవారై నీయందుఁ జూడఁబడుచుందురు. రజ్జువునందుఁదోచఁబడుచుండెడిసర్పమురజ్జువుకంటె వేఱుగాదు అట్లేనీయందుప్రతీతములగువిశ్వాదులునీకంటె వేఱుగారు.వారు నీయాభాసలు అనగా (బుద్ధిసంబంధముచేనీవుజ్ఞాతృత్వాది ధర్మములుకలిగినవాఁడవై యటులనాభాసించెదవు) ఆభాసయనగాపరమార్థముగా లేనిదైనను శుక్తియందు రజితమువలెఁదోచెడిమాత్రమే స్వరూపముగలది. వాస్తవముగా నది సద్రూపముకాదు. జలమందు నీవు సూర్యబింబమునుజూతువు. సూర్యునికంటె వేఱుగా నిజమైన ప్రతిమరూప మొకటియందుకలదా? లేదు. అందుఁ గనఁబడెడిది నీ మనోవృత్తిరూపప్రభమాకారమే నిజముగా నదిలేనిదైనను భ్రమచేనుండునదిగాఁ దోచఁబడుచుండును. కావున విశ్వతైజసాదిజ్ఞాతలు భ్రమభూతులు సత్యములుకావు జ్ఞానమాత్రమె సత్యము అదియే నీవు అదియేనేను. నీవు గగనమువలె లోపలవెలుపలనంతట వ్యాపించి దృశ్యసంబంధములేక ప్రకాశించెడివాఁడవు. శ్రుతి "ఆకాశవత్సర్వగతశ్చనిత్య" ఇతి నీవునిజస్వరూపమును మఱచి యనాత్మలైన దేహబుద్ధులయం దాత్మత్వప్రతిపత్తిని జెంది స్థూలుఁడను కృశుఁడను దుఃఖినియని నీవు భ్రమనుజెందుచుంటివి.

కామాది ధర్మములు నీవికావు కృశత్వాదిధర్మములు నీవి కావు నీవు నిర్ధర్మడవు నీవు క్రియను జేసెడివాడవు కావు. తత్ఫలము ననుభవించెడివాఁడవు కావు. స్వరూపావస్థితిచేఁ బ్రకాశించెడిచైతన్యరూపుఁడవు. నీ నిజస్వరూపమును నీవుమఱపుఁజెందితివి నీస్వరూపమును సూర్యుని మంచువలె నావరించినదియొకటి యున్నది. దీనినే ఛాయయనియు నజ్ఞానమనియు అవిద్యయనియు పలువిధసంజ్ఞలచే నాత్మవేత్తలువచించుదురు. అది నీ స్వరూపమునకుఁ బట్టతెరవలె నావరకమైనందున నీశుద్ధతెలివి రూపము నీకు స్ఫురించుటలేదు. అగ్ని నిత్యప్రకాశముకలదే అదియే నుసిచేతఁ గప్పఁబడిన దాని ప్రకాశము వెలుపలికి వ్యక్తముగాఁజూడఁబడదు. అట్లే నీవును మాయచే నావరించఁబడినందున నీ స్వరూపము నీకుఁ తెలియుటలేదు. అంతమాత్రముచే నీ స్వరూపమునకు నాశములేదు. సూర్యుఁడు మేఘములచే నావరింపఁబడినప్పుడు ప్రకాశములేనివానివలెఁ గనఁబడుచుండును. అట్లే నీవవిద్యచే నావరింపఁబడినందున నీ నిజస్వరూపము వివేచనముగాఁ దెలిసికొన నీకు దుర్బోధమాయెమూడవస్థలలోను నీ రూపము నీకుఁ దెలియఁబడుటలేదు. (తత్వాప్రతిబోధః) అందుచేతనే జాగరమున బుద్ధిసంబంధముచే బహిఃప్రజ్ఞుఁడవై యహంకారవృత్తిచే పరిచ్ఛిన్నాకృతిగల్గిన విశ్వునిగ వికల్పించుచుంటివి. స్వప్నమున తైజసునిగవికల్పించుచుంటివి. సుషుప్తియందు ప్రాజ్ఞునిగ వికల్పించుచుంటివి (స్వప్నజాగరయో స్తత్వాప్రతిబోధః విపరీతజ్ఞానం చ సుషుప్తౌ కేవలం తత్వాప్రతిబోధః ఇతిగౌడపాదః) లోకములోనంధకారముచే రజ్జువుకప్పఁబడియుండిన దానినిబురుషుఁడు దెలిసికొనలేక సర్పముగానైన భూచ్ఛిద్రముగానైనదండముగానైన వికల్పించును అట్లె శుక్తినిజూచి రజితమునుగ వికల్పించును. అటులనే నిజస్వరూపము మాయచే నావరింపఁబడినందున దానిని గనుగొనలేక నీవు నిన్నుఁ జాగరాదులఁ దెలిసికొనెడి విశ్వాదిజ్ఞాతలనుగా వికల్పించుకొనుచుంటివి. నీకంటె వేఱుగా విశ్వాదిజ్ఞాతలులేరు. నీవే బుద్ధిసంబంధముచే విశ్వతైజస ప్రాజ్ఞులుగా నటించుచుంటివి. ఇందుకుఁ బ్రమాణవచనము "ఈశ్వరోజీవకలయా ప్రవిష్టోభగవానితి" శ్రుతి "తత్సృష్ట్వాతదేవాను

ప్రావిశత్" కాలత్రయమందుండెడిదియే సత్యము ఎయ్యది యొకప్పుడు గోచరమై మఱియొకప్పుడు జూడఁబడదో (వ్యభిచరించునో) అయ్యది మిథ్యయని తెలిసికొనుము అంతః ప్రజ్ఞత్వాది ధర్మములుకల జ్ఞాతృస్వరూపములు నీవు కావు. ఎందుకనిన అవి కాలత్రయమందుండెవికావు. కాలత్రయమందుండెడిది యొక జ్ఞానమే అదియేనీవు నీవేశ్రోత్రమునకు శ్రోత్రము మనస్సులకు మనస్సు వాక్కునకువాక్కు ప్రాణములకు ప్రాణము అనగా శ్రోత్రాదింద్రియములఁ బ్రకాశింపఁ జేసెడివాఁడవునీవే. నీచేఁదెలిసికొనఁబడెడి (విదితము) నీవు కావు తెలిసికొనఁబడనిది (అవిదితము) నీవుకావు ఈవిదితా విదితములఁ దెలిసికొనెడి వేదితయేనీవు బుద్ధిసంబంధముచే నీవు వేదితవుగాఁ జూడఁబడుచుందువు కాని స్వయముగా నీవు వేదితవుకావు. నీవు కేవలము వేదనస్వరూపుడవే అనగా దెలిసికొనెడివాడవు నీవుకావు తెలివియేనీవు చూచెడివాఁడవు నీవుకావు చూపే (దృష్టి) నీవు నీయందే జ్ఞాతృజ్ఞేయములు రెండును మరుభూమియందుఁదోచఁబడెడి జలములవలెఁ బ్రతీతములగుచున్న వితిరిగి బాధితములగుచున్నవి. నీవుమాత్రమన్నియవస్థలయందు బాధితుఁడవు బాహ్యాంతరములయిన వేద్యములఁదెలిసికొనెడివాఁడవు నీవే నీవేబ్రహ్మము శ్రుతి(అయ మాత్మాబ్రహ్మ) నీకంటె వేఱొకడు వేద్యమును దెలిసికొనెడివాఁడు లేడు. నీవేసర్వమునకు వేదితవు నిన్నునీవు దెలిసికొనెడివాఁడవుకావు నీవుస్వయముగా నీవే అనగా స్వసంవేద్యుఁడవుకావు. సర్వమును దగులఁబెట్టెడియగ్ని తనను తాఁదగులబెట్టుకొనఁ గలుగునా ? (నహి వేదితా వేదితుః వేదితుంశక్యః యథాఅగ్నిః దగ్ధురివదగ్ధుమగ్నేః) ఇంకొకనికి నీవు వేద్యుఁడవుకావు నీకంటె మఱియొక వేదితయు లేడుసర్వమునీకే వేద్యము అనగాసర్వమును దెలిసికొనెడివాఁడునీవే శ్రుతి "నాన్యదతోస్తి విజ్ఞాతృ" 'సవేత్తి వేద్యంనచతస్యాస్తి వేత్తా' ఇతి కావున నీవు స్వయముగా వేదనస్వరూపుడవు సర్వమునకు నీవే వేదితవైయుండ నిన్ను నీవెవనిచేఁ దెలిసికొనెదవు ఎవనిచేతను నీవు తెలిసికొనఁబడవు శ్రుతి॥ విజ్ఞాతారం కేనవిజానీయాత్ ॥ నీవుకాలత్రయమునందబాధితుడవై భాసించెదవుగాన నీవేసత్యస్వరూపుడవని చెప్పఁబడుదు

వు నీకంటె నన్యములయిన బుద్ధీంద్రియాది సకల జగత్తు ఒకకాల మందు ప్రతీతమై కాలాంతరమందు బాధితమగుచుండును కాన నది యసత్యమని చెప్పఁబడును. నీవంతట నీవేస్వయముగా నస్తితామాత్రుఁడవు బుద్ధ్యాది సకల జగత్తు నీచేత నస్తిత్వముగలదగుచుండును నీచేత నేయదియున్నట్లుగాఁబొందఁబడుచున్నది. కావునదానియందుస్ఫురించెడి యస్తిత్వము నీదే కావున అవి స్వయముగా నసత్తులేయని తెలిసికొనుము. (Soul is itself existence, the world itself has no existence but it has existence from soul. ఘటాది పదార్థాః అసద్రూపాః జ్ఞానవ్యతిరేకేణ అనుపలభ్యమానత్వాత్) నీవుస్వయముగానే జ్ఞానమాత్రస్వరూపుడవు నీకంటే నితరమయిన బుద్ధ్యాది సకలజగత్తునీచేతనే జ్ఞానము కలదగుచుండును కావున దానియందుఁజూడఁబడెడి జ్ఞానాంశమునీదే అవి స్వయముగా జడములని తెలిసికొనుము నీవు స్వయముగానే ప్రేమరూపుడవు నీకంటె నితరమయిన బుద్ధ్యాది సకలజగత్తునిన్ను వినాస్వయముగాఁబ్రీతిమత్తుకానేరదుకావున దానియందుఁజూడఁబడెడుప్రీతినీదే అదిస్వభావముచేదుఃఖరూపమనియెంచుము. ఇందుకుఁ బ్రమాణము. "అస్తిభాతి ప్రియన్నామరూపంచేత్యంశపంచకం ఆద్యత్రయం బ్రహ్మణోంశః" ఇతి "సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ" "ఆనంద మమృతం యద్విభాతి" విజ్ఞానమానందం బ్రహ్మ" ఈబుద్ధ్యాది సకల జగత్తు అసత్తనియు జడమనియు దుఃఖరూపమనియు తెలిసికొనుము నిన్ను సన్మాత్రునిగా జ్ఞానమాత్రునిగా ప్రేమరూపునిగా నెంచుము. ఈజగత్తునందుఁ జూడఁబడెడియస్తిత్వ జ్ఞానాంశప్రీతులు నీవియే అంతఃకరణాది యుపాధిద్వారమున సర్వము నవభాసింపఁజేయుచుండెదవు కనుక యాయవభాసకత్వధర్మముఁబట్టి నీవుచిత్తువనియు "ఆనందయితృత్వధర్మముఁబట్టియానందుడవనియుశబ్దములచేఁజెప్పఁబడుచుండుదువు. శ్రుతి॥ విజ్ఞానమానందంబ్రహ్మ॥ విజ్ఞానఘనఏవ॥ స్వయముగా నిరుపాధికమయిన నీస్వరూపమును వాగింద్రియము శబ్దములచేతఁ జెప్పఁజాలదు. ఎందుకనిన శబ్దప్రవృత్తికి హేతువులయిన నామజాతి క్రియాసంబంధములు నీయందులేవు శ్రుతియును ఏ విశేషములు లేనివాఁడవు కనుక సర్వవిశేష

నిషేధరూపముగా నీస్వరూపమును జెప్పుచున్నది. శ్రుతి "అస్థూలమనణ్వపూర్వమితి। అశబ్దమస్పర్శమరూపమవ్యయం। తథారసంనిత్యమగన్ధవచ్చయత్ ॥ నాంతఃప్రజ్ఞంనబహిఃప్రజ్ఞ మిత్యాది నేతినేతీత్యాదేశః స్వాయముగా నిరుపాధికమైన బ్రహ్మము తెలిసికొనినవారికిఁ దెలిసికొనఁబడనిదే యగును. ఎందుకనిన తానే బ్రహ్మమైన తాఁదానుగానె యయియుండెడిని. తననుతాఁ దెలిసికొనడు గాన నేను బ్రహ్మమును దెలిసికొంటిని అని యనుకొనక బ్రహ్మానుభవముగలవాఁడే నిజమైన బ్రహ్మవేత్త. కావున బ్రహ్మమును నేను దెలిసికొంటిని అని జెప్పెడివాఁడు బ్రహ్మమును దెలిసికొననివాఁడే. ఎందుకనిన తానే బ్రహ్మమైనపుడు తననుతాఁ దెలిసికొనుట సంభవింపదు. శ్రుతి॥ యస్యామతంతస్యమతం। మతంయస్యనవేదసః। అవిజ్ఞాతంవిజానతాం విజ్ఞాతమవిజానతాం॥ ఇతి నీరూపము నిర్విశేషము నిరుపాధికము కావున కుమారి స్త్రీసుఖమునువలె నిన్ను నీవనుభవముచేఁగనవలె నీవు శుద్ధదృష్టియేద్రష్టవుకావు నీస్వరూపము దేహేంద్రియములను బ్రకాసింపఁజేయుచు వానికంటె వేఱుగా వివేచనముతోఁ దెలిసికొన దుర్జ్ఞేయమై చూడఁబడుచుండును. కావున సూక్ష్మబుద్ధిచే విమర్శించి నీవు తెలిసికొనవలె. పండితులును మేధావులునయిన నింద్రాది దేవతలుకూడ స్వతంత్రముగా నీయణీయమైన బ్రహ్మను దెలిసికొనఁజాలక మోహమును జెందియుండిరి. ఇందుకొక యాఖ్యాయికను జెప్పెదనువినుము. పూర్వకాలమున దేవతలు రాక్షసులు పరస్పరము జయేచ్ఛులై యుద్ధమునందుఁ గలహించుచుండిరి. అట్లుండ ఈశ్వరానుగ్రహమువలన దేవతలు జయముబొంది మనసామర్థ్యముచేతనే జయముకలిగె రాక్షసులజయించుట మనమహిమేయని తనుమహిమను బ్రకాశింపంజేసికొనిరి. ఇట్లు దేవతలు మిథ్యాభిమాన గ్రస్తులైయుండ దానిని బ్రహ్మ తెలిసికొని దురభిమానముచే రాక్షసులవలె దేతలును పరాభవమును జెందకుండ నుండవలెనని యభిలషించుచు ననుకంపచేఁ దనయోగమాహాత్మ్య నిర్మితమయిన యత్యద్భుతమయిన పెద్దభూతమై దేవతలయొక్క యింద్రియములనెదుట నావిర్భవించెను. పిదప దేవత

లాభూతమును జూచి దానిని దెలిసికొనలేకపోయిరి. అంతట వారు భయమువలన దానిని దెలిసికొన నిచ్ఛగలవారై తమకు నగ్రగామియును మేధావియునైన యగ్నిని మాకంటె నీవు మిక్కిలి తేజోవంతుడవు ఈభూతమేమియో నిజముగాఁ దెలిసికొనుమని యడిగిరి. అంతట నగ్ని దానికిసమ్మతించి యాభూతముయొక్కసమీపమునకుఁబోయి మానభావముతో నిలిచె. తర్వాత ఆభూతము నీవెవడవని యగ్నిని నడుగ నేనగ్నిని జాతవేదుడను అని తనయొక్క ప్రసిద్ధమంయిన నామద్వయమునుఁజెప్పె. అంత భూతము నీకేమిసామర్థ్యమనియడుగ యీసమస్త జగత్తును దహింపఁజేయ గలిగెదనని యగ్ని ప్రతివచనమునుఁ బలికె పిదప భూతము వాని సమీపమున నొకతృణమునుంచి నాసమీపమున నీతృణమాత్రమును దహింపుము. దహింప సామర్థ్యము లేకపోయెనేని యీదురభిమాన మంతట వదలిపెట్టుమనిపల్క అగ్నియు తృణసమీపముపొంది తనయావచ్ఛక్తిని బ్రయోగించిన దానిని దహింప శక్తిలేనివాడై వ్రీడితుఁడై ప్రతిజ్ఞాభంగమునుజెంది మానభావముతో దేవతలనుగూర్చి తిరిగివెళ్ళె. ఆభూతమేమియో విశేషించి తెలిసికొన నసమర్థుఁడనైతిననియుఁ బలికె. పిదప దేవతలు వాయుదేవుని యీభూతమేమియో విశేషించి దెలిసికొనుమని యడిగిరి. అంత వాయువు ఆభూతమును గూర్చిపోయె. అంత నీవెవ్వడవనియడుగ నేను వాయువును మాతరిశ్వుడును అని ప్రత్యుత్తరమిచ్చె. నీకేమిసామర్థ్యమని యాభూతముతిరిగియడుగ ఈ ప్రపంచమందుండెడి దానినెల్లను చిమ్మగలనని పలికె అంత భూతమొక తృణము నతని సమీపముననునిచి దీనినిచిమ్ముమనియనెను. పిదప నతఁడు తనయావచ్ఛక్తిని బ్రయోగించినను నాతృణముకదలలేదు పిదప ఇతఁడును బ్రతిజ్ఞాభంగము నొంది దేవతలకడకేగి యదేమియో నేనెఱుఁగజాలనైతినని దేవతలతోఁ బల్కె అంతవారు ఆభూతమేమియో తెలిసికొనుము మాకుచాలభయముకలుగుచున్నదని యింద్రునినడిగిరి అంతనింద్రుఁడా భూతముకడకేగ నదియంతర్ధానమాయె ఇంద్రుఁడు ఆభూతముయొక్క తిరోధానకాలము నందెచ్చోటఁ దానుండెనో యచ్చోటనేయుండి యగ్నివాయువులవలె మ

లిపోక యాభూతమేమియోయని ధ్యానించుచునుండె అప్పుడింద్రునికిఁ ల బ్రహ్మవిషయమైన భక్తినిదెలిసికొనియుమారూపిణియైన విద్య స్త్రీ రూపముగా నతనియెదుట నావిర్భవించెను. ఇంద్రుఁడు యీయామె దానిని తెలిసికొనుటకు సమర్థురాలని తలచుచు నామెకడకేగి ఇప్పుడిచ్చటస్వ రూపమును గన్పరచి యంతర్ధానమునుబొందిన భూతమేమియనియడిగె ంత నామె బ్రహ్మయనఁబలికె మేమేజయమును బొందితిమి ఇయ్యది రామహిమేయని యనుకొనుచున్న మీయొక్కడురభిమానమునుబో గొట్టుటకు బ్రహ్మయీరూపముగాఁ బ్రాదుర్భవించెను మీకు మి థ్యాభిమానముకలదు, మీకుబ్రహ్మనుగ్రహమువలననే జయముకలిగె ంగాని మీస్వశక్తివలన నయ్యదికలిగినది కాదు మీయహంకారమును దలుమనియు నామెయింద్రునకుఁజెప్పె పిమ్మటనింద్రుఁడాభూతమును బ్రహ్మముగా దెలిసికొనె. పిదపనతనివలననగ్ని వాయువులిద్దరు దెలిసికొని అందుచేత నేయింద్రవాయ్వగ్నులితరదేవతలకంటె శక్తిగుణాదిమహా భాగ్యములచే నధికులైరి. ఈముగ్గురిలో నగ్నివాయువులిద్దరుభూతమును జూచిదానితో ముచ్చటించిరికాని దానిని బ్రహ్మనుగా దెలిసికొనలేదు. ఇంద్రుఁడుమాత్రము సన్నిహితమైన బ్రహ్మనుజూచి ఉమావాక్యము వ న బ్రహ్మనుగా మొట్టమొదట దెలిసికొనెనుగాన నతఁడు సర్వాతిశా యియై ప్రకాశించెను కావున మేధావంతుడైన యింద్రుఁడును స్వతంత్ర ముగా బ్రహ్మనుదెలిసికొనలేకపోయె. అదియవాఙ్మానసగోచరము వునుసూక్ష్మదృష్టిచే నీనిజమైనస్వరూపమును శోధించుకొనుము. నీవు స్థూలముకావు రూపాదివిషయములను దెలిసికొనెడిది నీవుకావు. శు మైన తెలివియే నీవనినమ్ము యీసంఘాతమునునేనను భ్రమమానుము రీరసంబంధముచే నేనుస్థూలుఁడను, కృశుఁడను, నాపుత్రుఁడు, నాభార్య, ను దరిద్రుఁడను, అని నీవు భ్రమఁజెందుచు నీసంసారమోహములో మునుఁగుచుంటివిఇదియంతయుసత్యముకాదు. ఇదియంతయు స్వప్నమ నమ్ముము అనాదినుంచియీస్వప్నములో నీపారమార్థిక రూపమును మఱచి యీసంసారమును సత్యమనినమ్ముచుంటివి ఈతుచ్ఛబుద్ధిని మానుము ఇది యంతయు నిద్రలేకయే కలిగినస్వప్నము ఇందుకుఁబ్ర

మాణము వశిష్ఠోక్తి "అనిద్రస్వప్నదర్శనం" ఈస్వప్నము స్వరూపా జ్ఞానమువలన కలిగియున్నది. ఇందుకొకయాఖ్యాయికను జెప్పెదతిలకింపుము. లవణుఁడనునొక రాజశ్రేష్ఠుఁడుకలఁడు ఇతఁడుసమస్తవిభవోపేతుఁడు ఒకానొకప్పుఁడితఁడు తనమంత్రివర్గముతో సభయందు సింహాసనము నలంకరించియుండె ఆసమయమున నొకయింద్రజాలికుఁడు నెమలి పింఛమునుఁ జేతియందిడుకొని సంభ్రమముతో నాభూపతికడకేగి తనశిరమతని పాదములసోక మ్రొక్కె అంతటరాజు అతనివైపుఁజూడ ఓమహారాజ నాయింద్రజాలవిద్యాభ్యాసము గాంచుమనినుడివె ఈశ్వరమాయవలె భ్రమంజెందించెడి తన నెమలిపింఛము నొకతూరి యారాజుశిరముచుట్టుఁద్రిప్పె అంతనతఁడు కాంతిపుంజముచేఁబ్రకాశించెడిదానిం గాంచె తోడనేరాజు పైమఱచి యొకస్వప్నభ్రమను గనె ఏమనిన, ఒకసామంతుఁడు వేగవంతమైన యశ్వముతో నాసభలోఁ బ్రవేశించి భూపతిసమీపమునకుఁజని ఈయశ్వరత్నము మాప్రభువుచేఁదమకుఁబంపబడెనని రాజుతో నుడివె అంతనింద్రజాలికుఁడు ఓమహారాజ ఈయశ్వరత్నమునెక్కి భువనమందు విహరింపుమనిపలుక రాజు అనిమేషదృష్టిచే దానిఁజూచుచు గోడయందర్పింపఁబడిన చిత్తరువువలె నిశ్చేష్టుఁడై యించుకసేపు ధ్యానాసక్తుఁడాయె దానిఁగాంచి మంత్రులుసభ్యులుమొదలగు జనసమూహము విస్మయమునొంది భయమోహములచే దుఃఖించుచు ముకుళితమైన పద్మవనముయొక్క ద్యుతినిజెందినదాయె జనకోలాహలమును శమించె పిదప భూపతి రెండుముహూర్తములలో మేల్కాంచి సింహాసనమునందు కంపితశరీరుఁడాయె. అంతమంత్రులదిగాంచి ఓమహారాజ నిర్మలమైన మీమానస మాకస్మికముగా నెందుచేసంభ్రమమును మోహమును జెందుచున్నదిఅని అడిగిరి. రాజు, ఉన్మీలితలోచనుఁడై యాశ్చర్యముతోనిట్లనియె. "ఈయింద్రజాలికునిచే భ్రామితమైన పిచ్ఛికనుగాంచినతోడనే నేనొకయశ్వరత్నమునెక్కి యేకాకినై మృగయార్థమరణ్యమునుగూర్చి పోవుచుంటిని ఈవేగవంతమైనగుర్రముచేత గహనమునందు బహుదూరముతీసుకపోబడితి యాగహనమందెచ్చటను జనముకాని పక్షులుకాని వృక్షములుగాని ఏమియుఁగాంచనై

భీషణమైన గహనముఁబొంది అధ్వగమనపరిశ్రమముచే మిక్కిలిక్షీ
ణుఁడనై దినకరుఁడస్తమించు వరకునందే కాలమునుగడపితి అంతనతి
ముగా దానినతిక్రమించి వనాంతరమునుగాంచితి తద్వనము మయూ
క్షి ఫలవృక్షాది సంపత్తుతోఁబరిపూర్ణమైనది అచ్చటనొక జంబీరపా
ప్రదేశమునుబొందిదానియొక్క స్కంధావలంబియైనయొకలతనుఁజేఁబ
ట్టుండ నింతలోనశ్వమదృశ్యమాయె నేనుమార్గపరిశ్రమముచే
సిసొలసి ఖిన్నగాత్రుఁడనై యనశనుడనై యతికష్టముగా నారాత్రి న
టనే గడపితిని. ఆకాననమున నిటునటుఁజరించెడి పక్షిజాతముతక్క
రులనేరిని గననైతి మఱునాఁడుదయమునఁ బ్రబోధఁజెందిఁ క్షుత్పిపా
తురుఁడనై యిటునటుఁదిరుగుచు నెండకుఁదాళలేక తహతహపడుచుఁ
ంచుచుండనింతలో నొకశ్వపచుని పుత్రికయన్నముఁదీసికొని యాత్రో
జనుచుండె దానింజూచి సమీపమునకుఁజని ఓబాలిక నేనుక్షుత్తుచేఁబీ
పఁబడుచుంటినియాయన్నము నాకుఁబెట్టుమని యడిగితి అందుకదిసమ్మ
పక ముందునేగుచుండె నేనుదాని వెంటనేచనుచుఁ బలుమారు దానిని
యాచించితి అదియెంతమాత్రము సమ్మతింపక యెట్టకేలకు ఓరాజా
నుచండాలస్త్రీని నీవుయాచించిన మాత్రముచేత, నేనన్నము బెట్టనని
డివిపోవుచు, నాతండ్రియీవనాంతక్షేత్రమందుభూమినిదున్నుకొనుచు
న్నాఁడు అతనికీయన్నమును దీసికొనిపోవుచున్నాను నీవు నాకు భర్తవై
వేని పతిప్రాణముచేతను బూజనీయుఁడుగాన అదినీకుఁబెట్టెద ననిప
క్క దానికి నేను సమ్మతించి దానిచేనీయఁబడిన జంబూఫలరసయుక్త
మైన యోదనముభుజించి యించుకసేపు విశ్రమించితి అంతనదినన్ను దనబ
హుప్రాణమునుఁగాఁదలచుచు నాతోఁగూడఁ దనతండ్రికడకేగి యితఁడు
నాకుభర్తయగును దీనికినీవనుమోదింపుమని పుత్రికయన నతఁడం
దుకు సమ్మతించె పిదపఁ బ్రొద్దుగ్రుంకెడివేళ మేముముగ్గురము మాక్షేత్రము
నుండి వరాహ కపి కుక్కుటాది జంతుయుక్తమయిన శ్వపచాలయము
కేగితిమి. నన్ను జననికిఁజూపి నియల్లుఁడితఁడేయని పుత్రికనుడువజన
నియుసంతోషించె. అంతటవారు శుభదినమున మాకిద్దరికి వివాహము
సలిపిరి. అష్టమాసములు సుఖముగా శ్వశురగృహమునందు నివసించితి

భార్య పుష్పవతియై కొంత కాలమునకు గర్భవతియునై యొక కన్యను
గనెను. ఆకన్య క్రమక్రమముగా వృద్ధిఁజెందుచుండ మూఁడవయేట తిరిగి
యశోభనుడయిన యొక పుత్రునిఁగనెను, పిమ్మట కొంతకాలమునకు
మఱియొక పుత్రునిఁగనెను. ఇట్లు భార్యతోఁ గాపురము చేయుచు పుత్ర పుత్రి
కలతోఁ గ్రీడించుచు నన్ను జంజాలునిగాఁ దలఁచుకొనుచు సుఖమనుభ
వించుచున్న నాకచ్చట ననేక సంవత్సరము లతిక్రాంతములాయె.
తర్వాత నేను జరచేఁ బీడింపఁబడుచు వార్ధకదశ యనుభవించుచుండ
నింతలో దేశమునందు క్షామము సంభవించెను. ఎచ్చటఁజూచినఁ బ్రాణులు
క్షుత్పిపాసలచే బాధింపఁబడుచుండిరి. దేశమందు తృణములు కాని
జలములు కాని యెచ్చోటను బొందఁబడకపోయె. అప్పుడు సమస్త
ప్రాణులు, మిక్కిలి తృణపత్రాంబుసమృద్ధమైన వింధ్య పర్వతప్రదేశము
నకేగిరి. మేఘములు వర్షింపనందున నన్నపానంబులు లేక ప్రజ
లచ్చటచ్చట నమితముగాఁ జచ్చుచుండిరి. ఇట్లుండ నా వింధ్య ప
ర్వత ప్రదేశమందు నాకస్మికముగాఁ గార్చిచ్చు కాననమునంటుకొని దాని
నంతయుదహింపఁజేసె. కొందఱు దానినుండి తప్పించుకొని తమ ప్రాణము
లఁ గాపాడుకొనిరి. మఱికొందఱు దానిలోఁబడిచచ్చిరి. నేను మాత్ర
ము నాముగ్గురి బిడ్డలను స్కంధమున మోసికొనుచుఁ దప్పించుకొని
బయలువెడలి యొక ప్రదేశమున శీతలమైన తాలతరుచ్ఛాయయందు
వారలదింపి విశ్రమించితి వారును నా శీతలచ్ఛాయయందే విశ్రమించిరి
యొక బిడ్డ బాష్పపూరితలోచనుఁడై ఓ తండ్రీ నన్ను క్షుత్తు బాధించు
చున్నది తినుటకు మాంసమును రుధిరమును సవ్వమని ద్విత్రిప
ర్యాయములడిగి చిట్టచివరకు ప్రాణాంతికమైన దశను బొంద దానిని
నేఁ గాంచలేక కాష్ఠములచేఁ జితిఁ బేర్చుకొని దానియందగ్నిఁ బ్రజ్వలిం
పఁజేసి నేను బ్రవేశింపఁబోవులోపల వేగముగా నీ సింహాసనమునుండి
కంపితుడనై పిదప తూర్యనినాదముచేత జయశబ్దముచేతఁ బ్రబోధితుడ
నైతి. ఈ తీరున నీయింద్రజాలకుఁడు నాకు మోహముబుట్టించె. ఇ
ట్లు రాజు మంత్రులతో నుడువుచుండ నింద్రజాలికుఁడును సంతర్ధాన
మొందె. అదివిని సభ్యులు విస్మయముచే నుత్ఫుల్లలోచనులై యితఁడీ

ంసారస్థితిని బోధించుటకొఱకు వచ్చిన నీశ్వరమాయయేగాని యింద్ర
లికపురుషుఁడు కాడని రాజుతోనుడివిరి" ఇంద్రజాలికునిమాయావిద్య చె
మింపఁజేయఁబడి రాజునిద్ర లేనివేళ స్వప్నముగనినరీతినినీవునునీస్వరూ
మునావరించినమాయచేభ్రమింపఁజేయఁబడి యనిద్రస్వప్నముఁగనితివి
ా రాజు స్వప్నమునచండాలస్త్రీతోఁ గాపురము జేసినటుల నీవును నీభా
ర్యాదులతోఁ గాపురము చేయుచుంటివి ఇదంతయు మాయావిలాసము
మని యెన్నకుము. ఆరాజు తూర్యజయాదిశబ్దములచేఁ బ్రబోధము
ంది తన నిజరూపము దెలిసికొనినతోడనే స్వప్నభ్రమయంతయు
ంచినట్లే నీవును నీనిజస్వరూపము యుక్త్యాదులచే విమర్శించితివేని
ు నిజమైన స్వరూపజ్ఞాన ముదయించును వెంటనే యీ కల్గిన స్వప్న
మయంతయు నశించిపోవును ఈబుద్ధిభ్రమచే స్వప్నముజెంది స్వరూ
మును మఱచి యీ సంఘూతము నిన్నుగా వికల్పించినమాత్రముచేతనే
వుసంఘూతరూపుఁడవు కావు నీవెప్పుడు బ్రహ్మమే ఘూకము పగఁటిని
ాత్రినిగా ననుకొన్న మాత్రముచేతనే పగలు రాత్రియగునా పగలు
ాత్రి యెప్పుడుఁగానేరదు పగలెప్పుడుఁ బగలే అటులనేనీవుజీవుఁడనని
ననుకొన్నమాత్రముచే బ్రహ్మత్వముబోయి నీకుజీవత్వముగల్గెనా,
ుగలేదు నీవు చిన్మాత్రమైన బ్రహ్మమే. అనాదినుంచి మాయావశ
న నిజమైన స్వరూపమును మఱచి స్వప్నభ్రమచే నీవు సంసరించు
ంటివి నీవుచూచుచుండెడి భార్య, బిడ్డలు, పశువులు, క్షేత్రములు,
ద్రవ్యములు మొదలగు పదార్థములన్నియు మాయికములే నీకు య
ార్థముగా భార్యాదిసంసారములేదు. నీవు అసంసారివి దేహేంద్రి
ావభాసకమైన జ్ఞానమాత్రమే నీ నిజరూపము నా పుత్రుఁడు,
భార్య యను భ్రమ దేహ సంబంధ వశమున నీకుఁ గల్గు
న్నది. కామిని దుఃఖిని యను భ్రమబుద్ధి సంపర్కముచేఁ గల్గు
న్నది. ఈభ్రమనువదలి చిన్మాత్రమే నేనని ధృఢభావనఁజెందితివేని
కుఁ గల్గిన ఈ స్వప్నభ్రమయంతయు నశించెడిని. అంతనీవు కేవల
ు చిన్మాత్రరూపుఁడవై ప్రకాశించెదవు నీనిజరూపము నీకుఁదెలియు
లేదు. అందుచే నేనజ్ఞుడను, దుఃఖినియని భ్రమచేననుకొనినమాత్రమున

నిజస్వరూపము నశించలేదు. మహారాజు తనను శ్వపచునిగ స్వప్న భ్రమచే ననుకొనిన మాత్రమున నతని రాజస్వరూపము నశించెనా నశించలేదు. కావున నీవెప్పుడును చిన్మాత్రమైన బ్రహ్మమే. అది [illegible] లో నేనీమనస్సునుంచుము అజ్ఞతప్రతీతివలన [illegible] గనంబడుచుండును. నీవు కేవలము స్వయంప్రకాశమైన జ్ఞానమాత్రమే. అట్టి నీయందు విరోధియైన యజ్ఞానముండ గల్గెడిని సూర్యునియందుఁ జీకటి యుండఁ గలుగునా [illegible]. ఉపాధి సంబంధవశమున, నీయం దజ్ఞానము జూడఁబడుచున్నది అదిసత్యముగా లేనిదే అదియు నాభాసమాత్రమే ఇం కుఁ బ్రమాణము శ్రుతి॥ సమోహానైతదచ్ఛాయ మశరీర మలోహితం శుభ్రమక్షరం వేదయతేయ స్తుసోమ్య ససర్వజ్ఞః సర్వోభవతి॥ ప్రశ్నోపనిషది॥ సా చ తు ర్యేన విద్యతే "న స్వప్నం నాపి నిద్రాం తుర్యే పశ్యంతి నిశ్చితాః ఇతి గౌడపాదకారికాయాం॥ అవిద్యా వి మానైవనష్టప్రజ్ఞేషుదృశ్యతే నాత్మైనవాంగీ కృతాకారా సమ్యక్ప్ర స్య సా కుతః॥ ఈయజ్ఞానము నీయందు రజ్జుసర్పముఁబోలి చూడఁబడుచుండును. ఎప్పుడును స్వయంప్రకాశమయిన చిన్మాత్రమే నేనని భావించుచుంటివేనిసూర్యోదయముచే మంచువలెనయ్యది నశించెడిని [illegible] యూదిత్యునివలె స్వరూపానందస్థితిచే విలసిల్లెదవు నీకు నీ నిత్యానందస్వరూపమెప్పుడును ప్రాప్తమే యయితే యవిద్యచేత నప్రాప్తముగ చూడఁబడుచుండును. నీవెప్పుడానంద స్వరూపముచేతనే భాసించుచుందువు. ఈవిద్యవలన కలిగెడి సుఖదుఃఖాదులఁ జెందక బ్రహ్మమునుఁజెంది నిత్యసుఖరూపుడవుగా నుండుటయే మోక్షము (అవిద్యాపగమఏవ మోక్ష ఇతివేదాంతినః)

ఇది శ్రీ న్యాయవేదాంతపాణినీయ పాతంజలాది శాస్త్రపాండిత్య ధ కొండమూర్యుపనామక వెంకటరత్నశర్మ శాస్త్రిచే రచియింపఁబడిన వేదాన్తచంద్రికయందు ప్రథమభాగము

సమాప్తము.

---

2690
1.2.73